# పాత్రములు.

| | |
|---|---|
| అర్జునుఁడు } బృహన్నల } | కృపాచార్యులు |
| | చిత్రసేనుఁడు |
| ఉత్తరుఁడు | దుర్ముఖుఁడు |
| కర్ణుఁడు | వికర్ణుఁడు |
| భీష్ముఁడు | దుశ్శాసనుఁడు |
| ద్రోణుఁడు | దుర్జయుఁడు |
| కంకుఁడు } ధర్మజుఁడు } | అశ్వత్థామ |
| | విరాటుఁడు |
| భీముఁడు | |
| నకులుఁడు | ఉత్తర |
| సహదేవుఁడు | సైరంధ్రి |

సూత్రధారుఁడు, విదూషకుఁడు, బ్రాహ్మణుఁడు, గోపాలకులు, అమాత్యుఁడు, మొదలగువారు—

పాఠక మహాశయులకు

ఈగ్రంథము నచ్చొత్తింపనిచ్చి నేను పనిత్తొందరలలో నుండుటచే దప్పుల దిద్దుటకు వీలుకలుగ లేదు. సాధ్యమైనంత నఱకిందు సవరించియుఁ గొన్నిటికి పాఠాంతరములు వ్రాసియుఁ బొందుపఱచితి. ఆయాతావుల నీ క్రింది విధముగ జముపుఁగొనుచు తక్కిన పొరపొచ్చెములను మీరే దిద్దుకొన ప్రార్థితులు.

| పుట | పంక్తి | తప్పు. | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|---|---|---|---|
| 7 | 8 | దిలక్ | దుగా | 32 | 21 | ర్త | [illegible] |
| 7 | 9 | వ్యథి | యథి | 34 | 10 | కరణము | కరము |
| 12 | 28 | గుణాంబుల | గుణంబుల | 34 | ,, | పహృదత | సహృద |
| | | వంబప | వంబునప | | | | యత |
| 13 | 17 | ణ్యాందన | ణ్ణాదన | 34 | 17 | యుగదోర్బ | బల |
| 14 | 20 | యుర్యో | కద | | | లిసా | దుర్గముడే |
| 17 | 11 | శరావిశాన | నిఖర్గబాణ | 36 | 5 | గధా | కృతరధా |
| 18 | 17 | నిచ్చెదము | నిత్తుమె | 36 | 15 | హూతం | హితం |
| 21 | 12 | ఆడు | నాడు | 44 | 19 | దాన్వీక | దోశ్కట |
| 21 | 13 | వీసనగవెంత | వీనిజంపుట | 47 | 16 | గధా | కృతరధా |
| 23 | 10 | సౌమ్య | సౌమ్య | 48 | 21 | సంగం | సగం |
| | | మునుకా | మయియా | 51 | 17 | ధ్వంబునక్ | ధ్వంబం |
| 23 | 11 | మత్త బల్ | జగా | | | | దునక్ |
| | | జంతర్యై | కుండాలపై | 52 | 10 | నములు | నలు |
| 26 | 10 | రధా | కృతరధా | ,, | 20 | వజ్రిం | వ్రజం |
| 27 | 4 | త్రరా | త్రరు | 56 | 6 | గుణాబున | గుణంబుల |
| 29 | 9 | గగన | గసగ | 57 | 19 | వాస | వాసము |
| 29 | 10 | నశై | శమై | 59 | 18 | వేరుండి | పాండవుండివి |
| 29 | 13 | సంపర్ణముగా | సంది | | | శేవచ్చుచుండె | వచ్చుచునుండె |

# తొ లి ప లు కు

——(౦)——

ఇది యాంధ్రవాఙ్మయోపచయావస్థలలో నాటకయుగ
మని పేరొందిన కాలముగద! అందుమన పూర్వాచార్యులేర్ప
ఱచిన రూపకనిర్మాణ వ్యవస్థల ననుసరించి వ్రాయుటయొక
మతము. పాశ్చాత్యుల నాగరికతతో మనకుసంసర్గ గలుగు
టచే వారిరూపక నిర్మాణపద్ధతుల ననుసరించి వ్రాయుట
రెండవమార్గము. పూర్ణముగ నీరెంటిలోను నేయొకదాని
ననుసరింపక కొంతమట్టుకు రెంటిలక్షణములు గల్గునట్లుగా
స్వప్రతిభను స్వరుచులను మాత్రమె యాలంబనముగాఁ గొని
రూపకముల రచించుట మూఁడవమార్గము.

ఈప్రకారము వ్రాసిన నాటకములుకూడఁ జాలఁగలి
వని చెప్పనొప్పును. శ్రీ గోమరం రామానుజాచార్యులు
వ్రాసిన యీయుత్తరగోగ్రహణనాటక మీమూఁడవకక్ష్యలోఁ
జేరునదిగానున్నది. నిర్మాణ నియమములలో వీనికిఁబరస్పర
భేదమున్నను భాషాసౌష్ఠవము భావమాధురియును, నవియన్ని
టను సమానములే. ఇదివరలో "ప్రేమలత" "కృష్ణశతకము"
"సాక్షి" యను నాటకము మొదలగు గ్రంథములువ్రాసి
కొంతవఱకుఁ బండితలోకము నానందింపఁజేసి మెప్పుగన్న
యీబాలకవి గారియొక్క యీయుత్తరగోగ్రహణ నాటకమున
ధారాశుద్ధి, శైలీప్రసన్నత, భావగాంభీర్యము మొదలగు గుణము

లొప్పుచునేయున్నవి. శైలి విషయమునఁ బ్రాచీనార్వాచీన మార్గములకు మధ్యస్థముగను బ్రయోగవిషయమున భారతమును బ్రమాణముగాఁ గొనుటచే నాదరణీయముగను నీ నాటక మొప్పారుచున్నది.

సుప్రసిద్ధ భారతకథాభాగమునె కథాశరీరముఁనుగొని వెలసిన యీనాటకము అందఱి కుపాదేయమై యనుటలో సందియములేదు. అట్టి యాదరణఁజూపి సహృదయలోకమీ బాలకవిని నుత్సాహపఱచి పూర్వసత్కథలనేకాక యాధునిక సత్కథలఁగూడ దృశ్యరూపమున రచింపఁ జేయించి యాంధ్రభాషామతల్లికిసేవఁ జేయఁ దోడ్పడుదురని నమ్ముచున్నాను.

ఈకవి యెవ్వఁడో నావిద్యార్థియుఁ గొలఁదికాలము నుండి మఱల సుపరిచితుండునయి, నను గోరుటచేత నీతొలి పలుకుఁగడు సంతసముతో వ్రాయఁ దొడంగితిని.

పొన్నూరు.
9—2—1927.

ఇట్లు,
కొలచల వేంకటప్పాశర్మ ఎం.ఎ,ఎల్.టి,
Deputy Inspector of Schools,
Ponnur Range.

— ... —

శ్రీ

# ఉత్తర గోగ్రహణము.

---

## నాంది

శ్రీకల్యాణగుణావహుండు విజయ
శ్రీయోను సంధాయి లో

కైకత్రాణుఁడు శిష్టరక్షకుఁడీఁకం
గృష్ణాదరార్ద్రాత్ముఁడుం

డాకృష్ణుండు శుభంబు లెల్లరకు ని
త్యంబిచ్చుఁగాకిమ్మహిన్

వీఁకన్ ధర్మమెకాంచుఁగాక జయమున్
విద్వజ్జన ప్రీతిమై

(నాంద్యంతమున సూత్రధారుఁడు పుష్పాంజలిఁ జల్లి)

సూత్ర—(తెరవంకఁజూచి) విదూషకా! గా రమ్ము.

విదూ—(ప్రవేశించి సభఁదిలకించి) రొట్టె విఱిగి నేతిలోఁబడినది. శ్రీయు క్తాగ్రణుండు జగన్నాటక సూత్రధారి. నీవన్నవో యుత్తర గోగ్రహణ నాటక సూత్రధారివి. ఈదృశ్య ప్రబంధమునకు రచయితఁ దెలుప వేడెద.

శ్రీ

# ఉత్తర గోగ్రహణము.



## ప్రథమాంకము

1. స్థలము : ఉత్తరకుమారాంతఃపుర ప్రాంగణము.

(ప్రవేశము ఒక బ్రాహ్మణుఁడు రామావధానులు.)

రామా—(తనలో) ఔరా! మాత్స్యనగరంబున నీఁడెట్టి దుండగము పుట్టె. కోటపాలుకలేక పెత్తనాలు గొంగడిజాట్లుగాని పొలాలి పైని గుడ్డపెగడిసికట్టి చేతఁగల ముల్లుకఱ్ఱతో అయా కుమ్మ, రావి మఱ్ఱి మొదలగు చెట్లక్రింద ఎల్లావును, బొల్లావును కాచికొనుచున్న వెఱ్ఱిగొల్లల బాగ్రుడ్డిఱేనికొడుకైన దుర్యోధనుఁడు బావమఱది చతురంగబలసంయుతుఁడై ఉత్తరదిక్కుననున్న ఆవులమందలను తోలుకొనిపోవుట! ఛీ! ప్రభువులు నీతిబాహ్యులు. ఇంక మూర్ఖాళ్ళ మురిపెములకు మిట్టిపడు తెఱ్ఱివెధవలకేమియడ్డు. 'యథా రాజా తథా ప్రజా'

(తెరలో గోపాలకుల కలకలము)

రామా—(ఆలకించి) అదుగో పాపము దెబ్బలుతిన్న గొల్లలు వచ్చుచున్నారు ముందు వారికథ తెల్సో

(ప్రవేశము గోపాలకులు, వెంకఁడు, సుబ్బఁడు, లక్ష్మణుఁడు)

సుబ్బ—ఓరి యెంకయ్యంగోయి ! లచ్చాయిగాడి తొంటియిరగ్గొట్టాడురా

వెంక—వోరివుండవోస్స. ఆ యెఱ్ఱపాగా యేసుకొన్నోరు నాగూబగదలే కాదు.

లక్ష్మ—సుబ్బిగా ! సుబ్బిగా ! కుమార్రాజాగార్తో సెప్పకుందం రారేంరా!

సుబ్బి—ఒరేంఅ లచ్చాయ్ ! నిన్నుకర్రా యేపేసింది ?

లక్ష్మ—దుర్యోదనమారాజట్రా ! వాడికిగనొయ్యా ! సేతిలో గదుచ్చుకోని పీకేర్రా. మొల్లకట్టి యిపిరేసుగాని నూబరాసుకుపోయింది.

వెంక—అరేయ్ ! నేను బత్తెపలుపు వూదలాగి సుంజను కాదేపినట్టు కాదే నురా ! ఆ కుమ్మితలపోగోణ్ని. వాడిపేరేంటిరా ?

సుబ్బి—పేరేందో : కర్ణుఁడు కావోను యెంకోయ్ ! వోరి అచ్చాయిగా వుత్తర్రాజాగార్దగ్గిరికి పోదాంరాండిస్స. (రామావధాని జూచి) అయ్యా ! శాత్తుల్లుగారూ ! దండం దండం. మాయావులు యిరిగి పోయినాయి.

రామా—లక్ష్మఁడూ ! సుబ్బఁడూ ! మీకువచ్చినభయం లేదు. వానిపొగరు కొలదికాలములోనే క్రుంగఁగలదు. పోయి రాజాగారితో మొఱపెట్టుకొండి (నిష్క్రమించును)

లక్ష్మ—మనదొలికి యెదకేగేడురా !

వెంక—పెదరాజాగారట్రా ! ఏడకో దచ్చిణానికి యిద్ధానికి పోయారు.

లక్ష్మ—అల్లది. అదికి నిప్పెట్టే వీళ్ళొచ్చారు.

[ప్రవేశము గవాద్యక్షుఁడు]

గవా—మీరేటికివచ్చారురా ! ఓరి యెంకోయి ! నేపోయి మతీమతీసెప్పి వస్తామపొండి.

వెంక—ఓరియబ్బో మాయాపురం తగిల్నాదయ్యా! దానికింగాని తాళ ఊడిపోయిందిరా. బలే సొగసుగావుండేది.

లక్ష్మ—పుల్లావుపోక తిరగడ్డదిరా. ఆబేపగయ్యాను కుమ్మేసింది దాన్ని డిసి వాళం తోసడం లేనేలేదు.

గవా—సేసెలగన్నటా! పెద్దవయ్యాతో అన్నీ సెప్పి గుడ్డిగాజుకొడుకును కొరతవేయించవా ?

సుబ్బి—గాజుగారితో మతిమతీచెప్పి మాగాయాలు సెప్పి బేగిరా! అమ్మోరు గుడికాడ నీకెదురుచూస్తావుంటాం

(నిష్క్రమింతురు)

(తెర యెత్తబడును. అంతఃపురము. ఉత్తరుఁడు, సైరంధ్రి, ఉత్తర, దాసీజనంబులు సర్వాసనాసీనులై యుందురు.)

ఉత్త—సోదరీ! ఉత్తరా! నృత్తగీత వాద్యంబుల నద్వితీయుండై పరగు బృహన్నల శిష్యత్వముంజేవిధి నీకు రుచించెడి?

ఉత్తర—సహోదరా!

తే. గీ॥ గాన నృత్త వాద్యానేక కళలయందు
నతి సమర్థుం డజేయుఁడా యమరులకును
బుట్టిచదివెనో పుట్టకపూర్వమితఁడు
చదివెనో యిన్ని చదువులు నందియుంబు.

(ప్రవేశము గవాధ్యక్షుఁడు)

గవా—(దండాలు పెట్టుచు) దేవా! పెద్దవయ్యా! తల్లీ! దండాలు దండాలు. దుర్యోధన్డు బలగంతోవచ్చి మమ్ముల్ని మాగంజిలాగి చెట్టుకిందపడున్నవాళ్ళని గూడలు విఱుగ్గొట్టాడు. మనవుందను తోలుకొపోతున్నాడు చిన్నదొర్యాలుకు సెప్పుతున్నాను దొరా!

మాగుండెలు మూల్గాయి. గూడలు తొలిగాయి. తలలు చితికాయి. పెద్దులోరు సిత్తగించి మన పసువుల్ని మనకు తోగ్రలని దండాలు దండాలు.

ఉత్త—(మహోగ్రుడై కౌరవుల నుద్దేశించి) ఓరోరి! రాజ్యమదాంధ పూరితులారా! ఎంతచేసితిరి. గవాధ్యక్షా!

శా॥ భీష్మ ద్రోణ వికర్ణ కర్ణ రణదో
ర్వీరుల్గడున్ మద్భుజా
ర్చిష్మత్ప్రోద్ధత శౌర్య సంపదఁ బ్రకా
శింపంగ శస్త్రాస్త్ర జా
లోష్మ స్ఫారముఁగాంచి పార్థుఁడను శం
కోన్మత్తులై పాఱఁగా
గ్రీష్మాదిత్యు వలెన్ మరల్తుఁ బసులన్
గీలింతు దుర్యోధనున్.

(కాంతించి యాలోచించి) సమయంబునకు తోచిందగు సాగధిలేమిం జేసి మనంబు విచారదశఁ జెందెడు. గవాధ్యక్షా! పురంబున వాకిళ్ళఁ జేని గధసారథిగలండేని వేగ విచారించితమ్మా.

గవా—చిత్తం. (నిష్క్రమించును)

ఉత్త—ఉత్తరా!

చ॥ జనకుఁడు పెద్దఁజేసి నను
సత్సభలోఁ గులభూషణుండటం
చనయము శౌర్యశాలి యని
యందఱిముందఱ నుగ్గడించు నేఁ

దనవలు కౌరవేంద్రు లిటు
లందఱు వచ్చిన జంక; మత్పురం
బున రథసారథిం గనమిఁ
బూర్ణవిషాద దవాగ్ని తప్తుఁడన్.

ఉ॥ భారము నెత్తిఁబెట్టి జన
పాలుఁడు మత్స్యధరావిభుండు స
ద్భూరి యశోధనుండు నృప
పూజ్య విరాటుఁడు కోటవీడె; ని
చ్చో రథికుల్గురుప్రథిత
శూరగణంబు పశువ్రజంబు న
య్యో! రహిఁగొంచుఁ బోఁదొడఁగి
రొక్కెడ నేమిరయువర్వఁగాఁ దగున్.

*రథసారథి యొక్కఁడుండెనేఁ గనరాఁడే! ఔరా! ఏమి యీవింత!
ఇమ్మహీతలంబున నిజంబుగ మాతమహోత్సాహము జనించెఁగదో.

ఉత్తర—సోదరా! పురరక్షణకుఁ గలదు వెదకింపుము. నిరుత్సాహపడకుము.

ఉత్త—ఏనిప్పుడెచట కర్తవ్యంబు విచారించెద. (నిష్క్రమించును)

ఉత్తర—ఏమను నత్తనకాలయంబని యుద్యోగంబెల్ల బృహన్నల కెఱింగింతు.
ఇత్తఱిఁగాఁగల కార్యంబుఁ జక్కగా దొరచింపవలెను. ఆహా!
దూరనేనియు యెట్టి దురంతములు గలవు. (నిష్క్రమించును)

(యవనిక యెత్తఁబడును. నర్తనశాల. బృహన్నల దీర్ఘాలోచనాపరుఁడై యుండును)

బృ—చం॥ కటకటా! ద్వాదశాబ్దములు
కానలఁ బుచ్చితి మెంచరాని సం
కటములఁ గుందినారము జ
గద్బలశాలురమై నిరంతరం
బిటు పరు పంచలందు వసి
యించితి మాత్మ నిరూఢిచేత నె
న్నఁటికిఁక ధర్మరాజు స్వజ
నంబులతో ధర నేల గల్గునో ?

విధి యనుల్లంఘనీయము. మానవమాత్రుల మే మేపాటివారము.

సీ॥ సృష్టికర్త విధాత శివునిచేఁ గోల్పోయెఁ
జేయున దేలేక శిర మొకండు
ఈప్సితసంధాయి యీశ్వరుండే బిచ్చ
కుండై ప్రవర్తించెఁ గొండవీట
ముజ్జగంబుల కాదిపురుషుఁడే దానవే
శ్వరు నొద్దకేగి యాచకుఁడు గడఁగె
లోకబాంధవుఁ డినుం డేకాకియై రాహు
కేతులచే నుబ్బి కీడువడియె
నేఁగ రాముఁడే పదునాలుగేండ్లు వనికి
గరిత్రోవిఁ బట్టినలుండు కరమునందు

జాయఁ దెగనమ్ముకొన్న హరిశ్చంద్ర నృపతి
తాఱు మాఱయ్యెనేఁడు మా ధర్మరాజు.

ఇంతకు మున్ను నిన్నుయిక్కట్టులఁ గుడిపించినవాఁ డక్కుటిలుండగు దుర్యోధనుండే. (దుర్యోధను నుద్దేశించి) ఓరోరి! కులాధమా! దుర్యోధనా!

మ॥ సభలో ద్రౌపది గొప్పుబట్టి కులపాం
సా! యీడ్చుట ల్గాదిలన్
వ్యభిచారుండవు లక్కయింటికిని జి
చ్చంటించుటల్గాదు దు
ర్లభుఁడై భీముఁడు నీ తొడల్వికలము
ల్గాఁ గొట్టునాఁడే జామీ
యభిభూతుండవు కాఁగలాఁడవు నికృ
ష్టా! దుష్ట రాజాధమా!

మ॥ బలుఁడా భీముఁడు వంటవాఁడగుచు భీ
తత్వుండవా! పేడివై
కల మాద్రీసుతు లశ్వగోగణసుర
క్షాదక్షులై ధర్మరా
జులకంకుండయి పాండవేయులాకృతే
దజ్ఞాతవాసంబు నీ
కలన న్నిష్ఠతోఁ జేఁగడపి రిం
కన్ దైవయోగంబెటో.

ఆలమునందు సూతభర
మాదలఁదాల్చఁగ నెట్టులొప్పదున్
జాలు, సుయోధనాధకురు
సైన్యము దాకఁగ నేను పోవుటల్
తాలిమిమై బృహన్నల ర
ధంబునుదోలఁ బురంబునవ్వదే ?

సైరం— (అడ్డమువచ్చి) అర్జునుఁడింతవాఁడు నావచనం బమోఘంబు. ఇత్తఱి నన్ను ద్రోసిపేయక చెప్ప యోజింపుము.

ఉత్తర— అన్నా !

చం॥ అరదముఁదోలఁగా నల బృ
హన్నల సారధిగా గ్రహించితేన్
గురుబల మొంచుగా దాకటఁ
గూడి త్రిలోకము లెత్తివచ్చినన్
దురమున నిన్ను గెల్చుటయు
దుర్భరమన్న ! సురూపహీనతన్
నరునకు బెంపు దప్పెనె ? మ
నంబున నెంచుమ మేల్గ్రహింపుమా !

ఉత్త— (యోజించి) అవును. పేటికోర్కెసారధియే కలుగుటచే నను యానమూలంబుగ నా బృహన్నలతోఁ గైకొనవలెను. సోదరీ ! వానిం బిలిపింపుము.

ఉత్తర— (మందహాసముతో) శుభము. ఆ కలుగుగొందువు. సైరంధ్రి ! నీవు బృహన్నలయొద్దఁ గడుఁ జనవుగ సంచరింతువుగదా. వెడలి వెంట వానిం గొనితెమ్ము.

సైరం — కడు నప్పపాటులోఁ బోయి వాని మెడలు విఱిచి లాగుకొని వచ్చెద. [నిష్క్రమించును]

ఉత్తర — ఈ కౌరవులు నిర్హేతుక వైరముచే మన మేనమామలైన పాండవు నట్లరణ్యముల పాల్జేసిరి

ఉత్త — నేఁడు మనపైకి దండెత్తియే వచ్చిరి. మనము వారికే యపకృతిం జేసితిమి?

మ॥ జనకుండూరనులేదు తుచ్ఛ మనుజే
ఛ్ఛన్ ధార్తరాష్ట్రాగ్రజుం
డనుకంపారహితుండు నేఁడు స్వబలా
ధ్యక్షత్వముం బూని తా
ఘనుఁడై గావలివాండ్రఁ గొట్టి, పసుల
గైకొన్నవాఁడౌర! సి
గ్గును లేదీమగవాని పోకడలు లో
కుల్విన్నచోఁ నవ్వరే!

ఉత్త — ఒరులు పరిహసింతురని కుజనులు తమ దుష్క్రియల విడిచెదరా? అయ్యది ప్రపంచమునకు వెల్లడి కాకమానదు.

మ॥ సమతన్ గన్నులు రెండు మూసికొని మా
ర్జాలంబు పాల్ద్రావ లో
కము గుర్తింపదె? తానొనర్చునది దు
ష్కార్యంబుగాఁ దోఁచినే
ని మదిన్ దుష్టుఁడ దేలపూను? నెవఁడే
నిం బూనుచోఁ వాని చి
త్తములో నొంతు దురాశయుండవలెఁ ద
ద్యత్నంబిద్ది యోజింపఁగన్.

[ ప్రవేశము—సైరంధ్రి, బృహన్నలను వెంటఁగొని ]

బృహ—సైరంధ్రీ! నన్ను విడువుమా! నీమాటకు బదులాడ వెఱచి యిటు వచ్చుచుంటిఁజుమా! నాకు సారథ్యంబుచేయ నేర్పుగలదందువు. ఏట్లు మొత్తుకొందు

సైరం—బృహన్నలా! చాలుఁజాలు నీ బూటకములు నాకడఁ గట్టిపెట్టుము.

బృహ—అయ్యో! ఇది యెక్కడి గ్రహచారము

మ॥ కని యేడేండ్లు గలంచు; నేమిది యహా!
సైరంధ్రీ! నేఁడీవు నం
జనితోత్కిం బదునాలుగేండ్లు వృథ ము
చ్చన్ జూచుచున్నావు మ
ద్ఘన సౌందర్యము గన్నరాత్రిఁ గలలోఁ
గాన్పింతు శౌర్యంబట
న్నను గొంగొత్రలె? యేను పేడిఁగదఁబం
తం బేటి కిప్పట్టునన్?

సైరం—సరిసరి. యీ పుక్కిటి పురాణ మింతటితో గట్టిపెట్టుము.

[ అక్కఁబట్టుకొని యుత్తరునియెదుట నిలువంబెట్టును ]

బృహ—రాకుమారా! జయము. జయము.

ఉత్త—బృహన్నలా! రమ్ము ఇచ్చోట నాసీనుఁడవగుము. శ్రుతివాద్య గీతాద్యభినవకళలయందుఁ గడుఁగణుతికెక్కితివి.

బృహ—దేవా! మీవంటి రాజచంద్రములు కృపకుఁ బాత్రుఁడను. భవదీయా శ్రితులయందు గణంబు లెక్కింపఁబడఁదగినవాఁడనైనను సుదార సుశౌర్యులయిన మీవంటి భూమీంద్రులకు— — —

మావంటివారియెడ గౌరవభావము కరుణారసము స్వభావసిద్ధములు రాజనందనా! నన్నిందు రావించు కారణంబీ పరివారకుం డెఱుంగ జేయుచున్నాఁడు.

ఉత్త — బృహన్నలా! రథంబుగడపు చాకచక్యంబు మిక్కుటంబుగ నీకుండె నని యెవిందు.

ఉ॥ నా రథచోదకుండొక ర
ణంబునఁ జచ్చెను నాటనుండి యె
వ్వారును లేమిఁ జింతిలెదఁ
బైఁ బులిమీఁదను బుట్రి నేఁడొగిం
గౌరవసేన కయ్యమున
గాలున్ద్రవ్వె బృహన్నలా! రథం
బారయ నీవ సారధివి
యై గడవన్వలెఁ దప్పదేగతిన్.

బృహ — (వెలవెలఁబోవుచు) నేఁడు నాకిదేమి దైవఘటన. అయ్యో వైగాటీ!

కం. ఎందఱుగలరు వసుంధర
సుందరులు గురూపు లరసిచూడు విరాట్రి
ణ్ణందన! దేవు కరుణగా
కిందఱిలో నీకుఁదగునె? హేళనచేయన్.

అదియుంగాక

ఉ॥ ఆటలఁ బాటలున్న సమ
యంబున నన్బిలిపించవచ్చుఁగా
కేటికి నేడు తేర్నడపు
కేమిటి యేను నరేంద్రనందనా!

చాటఁగఁ బంపుమయ్య రథ
సారథికై మనవీటనొక్కఁడీ
నాఁటికిఁ జిక్కఁడే యిటు ల
నందగునే? కఱవా? తలంచినన్.

ఇట్టి తరుణంబున నన్ను విడిచిపెట్టుము. నీకు పుణ్యముండును.

ఆ. వె, సంగరమునకరుగు జ్యాభర్త వెనువెంట
బేడివానిఁ గొనెడు విధము జూడ
బెండ్లికరుగువాఁడు వేడ్కతోడుతఁ బిల్లి
జంకఁ బెట్టుకొనుచుఁ జనటకాదె.

ఉత్త — మంచి సామ్యముం గూర్చుకొంటివి.

ఉ॥ మున్ను కిరీటి ఖాండవము
బూదియొనర్చిననాఁగు వాని తే
రున్న డిపించితీవని యె
ఱుంగుదు; నాదెసఁ గూడ నట్టి సై
తిన్నిలుపందగున్ జయము
దేనగు; ఖడ్గముబూనియేను పో
రన్నిలువంగలండి సమ
రంబుననొక్కఁడు భీతిడక్కుమా.

బృహ— (భయమునుచే వణకుచు) రాజనందనా! ఉత్తరకుమారా! శరీరము భయకంపితమయ్యె ప్రాణములు తీపియయ్యె. ఈ కార్యమునకుం దక్క వేఱొక్క పనికై నన్ను వినియోగింపవేఁడెద.

ఉత్త— (ఒక్కింత కినుకతో) బృహన్నలా! వేఱొండు మాటడక్కుము. గ్రక్కున రణోత్సహానం బొనర్పుము.

బృహ— (భయముచే) చిత్తము దేవా! చిత్తము. భవదీయాజ్ఞ శిరమున దాల్తు.

ఉత్త— ఎవఁడురా యక్కడ?

దౌవారికుఁడు— (ప్రవేశించి) ఆజ్ఞ.

ఉత్త— ఈ క్షణంబె దృఢంబైన కవచం బొండు దెమ్ము.

దౌవా— చిత్తము (నిష్క్రమించి కవచము దెచ్చియిచ్చును.)

ఉత్త— (అందుకొని) బృహన్నలా దీనిం దొడుగుము.

బృహ— (సందేహించును)

ఉత్త— ఏమి యాసందించెదవు? (కవచము మీదవైచి) సత్వరము తొడుగుము.

బృహ— (తత్తరపాటున దానిం దలక్రిందుగఁ దొడుగును)

ఉత్తర, సైరంధ్రి, మొ॥ (కడుపుబ్బ నవ్వుదురు)

ఉత్త— (నగవాపుకొనుచు)

తే. గీ. తలపఁబరమమూర్ఖుఁడు తనుత్రాణమైనఁ
దొడుగనేరఁడు రథచోదకుఁడటనాకు!
నవ్వువచ్చెడి నివ్వాని నడతఁగనిన
నూరనగుబాట్లకే యేమొ? యీరణంబు.

(కవచము లాగుకొని) వేసతొడిగెద నిందుం గదలక నిలువుము.

బృహ— (నిలువుండును)

ఉత్త— (తొడుగం దొడంగును.)

బృహ— (చేయితావున దల, దూర్పఁబోవును.)

అందఱు— (నవ్వుదురు)

ఉత్త— ఉత్తరా! సైరంధ్రి! వీనిం జేరియొక పార్శ్వమునం బట్టుకొనుఁడు.

తే॥ గీ॥ తనకుఁ దోఁచదు చెప్పినన్ వినఁడు చాంద
సంపుమగని చెయ్వులీపేడి నలుపుగతులు
గౌరవుల దుండగములకై పోరుజేతు
మా? నగుదుమా? యభావ్యకార్యములకిచట.

ఉత్తర— సైరంధ్రీ— (బృహన్నలను బట్టుకొందురు)

ఉత్త— (కవచముఁదొడిగి) ఇంకఁబోయి తేరికి హయంబులఁ బూన్పుము.

బృహ— అవశ్యమొనరింతు (నిష్క్రమించును)

ఉత్తర— సోదరా! దుశ్శాసన కృపాశ్వత్థామ దుర్యోధనాదులెల్లరు దుండగీడులై మనతండ్రి పురంబునలేని తరుణంబునవచ్చి గోపాలగణంబు పైఁబడిరేమి?

ఉత్త— కారణము దురూహము (యోజించి) పాండుసుతుల నడవికిం దోలిరని గర్వాంధతచే నిట్లు మిన్ను మన్నుగనక చరించెదరు.

ఉత్తర— పాండవేయులు మన తండ్రికొలువునం గలరని విని వారిట్లువచ్చిరని యేమువిందుం. పాపము ధర్మరాజాదులెందుండగ్గిరో? మనకడ నున్నవారా? తుదకు వారి కుశలవార్తయైనఁ దెలియుట లేదుకదా!

ఉత్త— నేఁటితో నీ దుర్యోధనాదుల క్రుక్కణంచెదంగాక చూడుము (కోపముతో)

మ. శకునిం జంపుదుఁ; గర్ణుఁ ద్రుంతును; కృపా
శ్వత్థామలం జెల్లు, దు
ష్టకథావాలు సుయోధనాధుని మహై
శ్వర్యంబులందోఁతు; నేఁ
టికి బాంధుక్షితిపాలపుత్రకుల ధా
టిం జూపగాఁ నా కిరీ
టికిఁ బెంపెచ్చఁగఁ గౌరవేశ్వరుల గుం
డెల్ఁ జీల్చి చెండాడదఁగా.

అమ్మాయీ! ఉత్తరా! సైరంధ్రీ!

కం. బలులు మన మేనమామలు
సలలితులౌ పాండుసుతులఁ జయ్యన విపినం
బులకనిపిన దుర్యోధన
ఖలునకుఁ దత్కర్మఫలము గట్టిగఁజూపెదున్.

[ప్రవేశము బృహన్నల]

బృహ— ఉత్తరకుమారా! జయము.

ఉత్త— ఏఁజెప్పినట్లన్నియును నాయుత్తరవుచితివా?

బృహ — చిత్తము.

కం. తేరికి జవనాశ్వములం
గూరిచితి శరావితాన కోదండములం
జేరిచితిఁ గేతువెత్తితి
భూరమణకుమార! యేను మునుముందుంటిన్.

ఉత్త— (వీపుసఁదట్టుచు) బృహన్నలా! మేలు. రణరంగంబున సమయోచితంబుగ మెలంగు చందంబు నీకనుభవనీయంబుకదా!

బృహ— దేవా! నా యీ శిరంబోపిన యంతవట్టు సంగరమునఁగల తెలఁగెఱుంగుదు నీకా సంశయమెందులకు? వినుము.

ఉ. భండనభూమి సంచరిలు
భంగిమెఱుంగుదుఁ గొంతవట్టు; నీ
వుండినచోట నుండవలె
నొప్పుగఁ జెప్పినచొప్పునర్ప శ
త్రుండనుగావలెం బ్రభున
కున్ యశమీవలె; బుద్ధిబల్మి ను

ద్దంబుఁడనౌచుఁ దోలెద ర
థంబున; నీవరికోటిగెల్వుమా.

ఉత్త— చక్కఁగ పలికితివి. నీవు సామర్థ్యంబునకు సారథివై యుండుము తక్కిన పనినంతయు నేన చక్కఁజేసెదను.

మ. గురునింగూల్చెద; ద్రోణుఁ ద్రుంచెదను; నా
కున్ లెక్కయే తక్కరుల్
కురుసైన్యాటవిలో మృగేంద్రముకఁ డే
గుం దేరఁగాఁ బోలునాన్
గరులన్ మొత్తెద; వాజులం దునిమెదం;
గర్ణున్ విదారించెదన్;
బోరి దుర్యోధన దుర్ముఖప్రముఖులం
బోరన్ దుటారించెదన్.

బృహన్నలా! గోగ్రహణంబు సేయుటంజనుము. ఏమను సమ్మతివి.

ఉత్తర— అన్నా! ఉత్తరా! నాకొండు కోరికగలదు. కోపింపకుందువేని యడిగెద

ఉత్త— తల్లీ! అడుగుము మనస్వాంతమేరుచుండఁగా నీకొద్దానం గొదువ రానిచ్చెదను.

ఉత్తర— నీతోఁబుట్టువు కోరిక చెల్లించదగా? ఇట్టి ఘోర సంగ్రామమున యందున నాడువారి కోరికలు మనుపువకు రావాయని త్రోసిపుచ్చెదవు. ఇప్పటికి గానిమ్ములే

ఉత్త— మరల నదేమి? ఉత్తరా! చెప్పుము.

తే॥ గీ॥ విల్లుచేఁబట్టి పరుగిడ వెన్కనంగి;
శూరులనుమొత్తి జయలక్ష్మి జారగొందు;

తల్లి! తంత్రీయూరను లేదు దాచిపెట్ట
కిఁ గవచింపుమా! నీవాంఛ లెల్లఁ దీర్తు.

ఉత్తర— ఏమియు లేదుగాని యీవు కురువీరుల గెలిచి వారల కింపైనట్టి వియు చిత్రవర్ణములు గలట్టివియు వీరుల తలలకు ధరించినట్టివియు నగు భాసురాంబరములను నా బొమ్మపొత్తికలకుం దెమ్ము.

ఉత్త— (నవ్వి) ఇదియా నీకోరిక.

బృహ— అమ్మాయీ! మంచిదియే కోరుకొంటివి. బాలికలకు బొమ్మలుఁ బొత్తికలుఁ గాక యింకేమి కావలయును.

చం. మనుపరి మత్స్యభూధవకు
మారుఁడు వైరులగెల్చి గోగణం
బును మరలించి తెచ్చునిఁక
భూరిబలోద్ధతి వీరులెల్ల నె
త్తిని ధరియించు పాగలను
దేఁకునతోఁ దుదిఁగత్తిరించి తె
త్తునగడుఁ బట్టుకుచ్చులను
దొయ్యలి! మోదముబొందుమా! యిఁకన్.

ఉత్తర— అన్నయ్య పోయిరమ్ము

సైరం— బృహన్నలా! మున్నాఖండలసూతికిం గూర్చినట్టి మాంగల్యంబు నేఁడీ యుత్తరునకుం గూర్చుము. జయంబగుఁగాక పోయిరండు.

ఉత్త— గవాధ్యక్షా!

గవా— (ప్రవేశించి) దేవరయాజ్ఞ.

ఉత్త— ఈవు ముందునడచుచు వారు పసులందోలికొని చన్నదిక్కుం జూపుము.

గవా— చిత్తం ప్రభూ!

ఉత్త— బృహన్నలా! నడువుము. (నిష్క్రమింతురు.)

—...—

గద్య.

శ్రీ............రామానుజాచార్య ప్రణీతంబయిన శ్రీమదుత్తర గోగ్రహణంబున ప్రథమాంకము.



శ్రీ

# ఉత్తర గోగ్రహణము

## ద్వితీయాంకము

— o —

[ స్థలము మత్స్యమండల సమీప శ్మశానభూమి కౌరవసేన
భీష్మ ద్రోణ కర్ణ గురు శ్యాసాదులు

కర్ణ:— (దృష్టి నిగిడ్చి చూచి) కౌరవ సంగ్రామ దుర్ధర మహారాజా
అ కనంబడువాఁడేమి?

అందఱు (చూచెదరు)

కర్ణ:— రథంబొండదియె శరవేగంబు చ్చుచున్నది

భీష్మ—ఒక్క రథికుండును సారథియు మాత్రమే కన్పట్టుచున్నారు

కర్ణ:— ముందున్న మనుజుఁడు కడువింతరూపుతో దోఁచెడి.

తే॥ గీ॥ వికృతకాయంబు సరిగదా పేడిమొగము
ఆకురూపంబు బలహీనుఁడనఁగఁదోఁచు
వీఁడనఁగనెంత కొండఁద్రవ్వి యెలుకఁ
జంపినవిధాన మనకె లజ్జాకరంబు.

సీ॥ చేఁగొన్న లలితాంగి చీరలొల్చిననాఁడు
  పరికింపమె? కిరీటి పౌరుషంబు
లక్కయింటికిఁ జిచ్చు రగులఁగొల్పిననాఁడు
  వినమె? ధనంజయు విక్రమంబు
అల జూదమునఁ గెల్చి యడవి కంపిననాఁడు
  గాంచమె? యర్జును కౌశలంబు
సహధర్మచారిణి సభకు నీడ్చిననాఁడు
  చూడమె? ఫల్గును ప్రౌఢతనము
పార్థునకు నంత వెనుదీయ బలులుగారు
తక్కఁగల యన్నదమ్ములు దలఁపనేల?
అమ్మ పుట్టింటివారి వృత్తాంతమెల్ల
మేనమామ కడనా? యమానచరిత!

(రౌద్రముతో) ఒక్కవేళ నన్నుఁ దుండ నవుంజైనచో భీష్మ ద్రోణ కృపాశ్వత్థామ మహాయోధవారా! వినుఁడి.

శా॥ బాహాబాహుద్దండిత దర్పవిక్రమ రణ
  ప్రావీణ్య సంశోభినై
నీహారాద్రిసుతా మనోహర జయో
  ర్జ్జీలున్ నితాంతావరా
ఘోరాహర్యున్ మనపార్థు నొక్కరుఁడనే
  యసృ[illegible]
ధ్యాహంకారిని జేతు యు[illegible]యుం

అశ్వ— కర్ణా! ఇత్తఱిఁ బలుకులతోఁ బ్రయోజనంబేమి? కారణం జేయుటకే వచ్చియున్నారు.

ద్రో— అంగరాజా! యీవు తప్పఁబలికితివి. నిక్కంబుగ వాఁడర్జునుఁడ యేని మనము నడవికేఁ బ్రాగ్వృత్తాంతంబుగఁ బండ్రెండు వత్సరంబులు సంచరింపవలయును. ఒరుండయ్యేనిని నస్మచ్ఛిలీముఖపాతంబున శలభీభూతునిఁ గావించెద. ముందు గోరక్షణార్థమై జాగరూకుల మయ్యెదము రండు.

భీష్మ— మాకునదియే సమ్మతము. (అందఱు నిష్క్రమింతురు)

(అంత ప్రివేశము ఉత్తర బృహన్నలలు రథారోహణులై)

ఉత్త— రథమును మరల్పుము బృహన్నలా!

ఉ॥ కౌరవయోధ సైన్యమనఁ
గా నిదియా? మనమందు నన్యథా
యూరసినాఁడ నింతవఱ
కక్కట! మేఁగరుపాటెఁ జిత్తమూ
జాతెను జూపు ఆేచ్చవడెఁ,
జాలను యుద్ధమొనర్పఁగా నికం
దేరు మరల్పుమా! పసుల
దేవుఁడెఱుంగు నిలక బృహన్నలా!

బృహ— (వినిపించుకొనకయే రథముం దోలును)

ఉత్త— ఓహో! నపుంసకా! ఏమిట్లు ఎదిరిం దన్ను గొలుంగక పులినోట జిక్కుకోఁజూచెదవు. జాపలు గాఱించి ప్రాణంబుల వెన్కఁద్రిప్పవా

మ॥ కరులర్పింతు; రథంబులిత్తు; మఱియుం
గంజాక్షులం గూర్తు; ను
త్తర వాగ్దానము తప్పదెయ్యఁడను ఏం
తల్మాను మిప్పట్టు నం
దరయన్ రాజ్యమునన్ సగంబిడుదు లే
దా తేరు పోనీయకే
మరలింపం గదవయ్య పున్నమగు నా
మర్యాద గాపాడుమా.

చ॥ బ్రతికిన బల్మికూర దిన
వచ్చును ప్రాణమూలిపి నా నుడిన్
మఱికెఱుఁగింగ రాదె? యవ
మానముమూట యటుండనిమ్ము దు
ర్మతులు కురుప్రగల్భు లన
మానులు నాకును నీకు లోంగువా
రె? తలఁపు నీకు లేదు నను .
నెగ్గులు పల్కఁగఁ జాతువక్కటా.

బృహ — రాకుమారా! ఇదియేమి? అంతిపురంబునఁగల యంగనలముందు బ్రగల్భములు గొట్టితివిగదా మఱలిచన నగరవాసు లెల్లరు నవ్వరా?

ఉత్త — (కోపముతో) రణరంగ విషయములు నీకేమి తెలియును?

శా॥ ప్రాణంబున్న మఱొక్కనాఁ డరుల గె
ల్వన్ వచ్చుఁ గాకేమి యీ

నేనన్నే ఘోరకరుండవే గెలుతువా?
శౌర్యోపేతుఁ లాఘుండవే
యైనన్నీకిటు బుద్ధిపుట్టదు రథం
బన్నా! మరల్పందగున్
భూనాథోక్తిని దోసిళ్ళుచ్చుటలు త
ప్పౌల్ నాదు మెప్పొందుమా.

బృహ— శత్రువులకు వెన్నిచ్చిపోవుట నీవంటి యుత్తమ నృపాలకుమారునకుఁ దగదు, కౌరవసేనం దునుమాడుట యొకకష్టం బెన్నటికిం గాదు. ఇదిగో రథంబు నతిత్వరితంబుగ నశ్వారత్నములఁ గదలఁ దోలుచుంటి (అట్లు చేయును)

ఉత్త— (తనలో) వీఁడేఁడు చాపలుఁడుం గొవ్వండు. రథంబుదిగ్గ నుఱికి పలాయితుండనై నగుటయే యుత్తమము. (రథముపైనుండి యుఱికి పాఱిపోవును.)

బృహ— (తెల్లబోయిచూచి) ఓరా అపకీర్తియే తెచ్చినాఁడు

ఉ। రాచకొలానికెల్లను వి
రాటసుతుం డపకీర్తిఁ దెచ్చెనం
చాఁ చపలాత్ములున్నగుదు
రంతటితో సరిపుచ్చుకున్న నం
తో చతురంబు; తేవాకట
నుత్తరుతో విజయుండునుండె నం
చీ చరితంబు లోకమున
నే కొనియాడైనను నిందబొందనే?

కౌరవులీ యుత్తరకుమారప్రజ్ఞను గాంచి కాబోలు నవ్వుచున్నట్లున్నారు. ఏవిధమైన వీనింబట్టితెచ్చి రథంబున గూలవైచి యుద్ధమొనర్చెద. ఈసమయంబున నుత్తరుని గొనిపత్తు పట్టునమైన నయులకు వెన్నుజూపి పరుగిడరాదు.

(వెనుకకు పరుగిడును)

(ప్రవేశము భీష్ముఁడు)

భీష్ముఁ— కేఁడీ జరుగబోవు రణంబున దుర్యోధనునకు జయమునుగతి గన్పట్టదు. ఎచ్చోటఁగాంచిన దుశ్శకునంబులే చూపట్టెను.

శా॥ కూసెన్నక్కలు నద్దెసల్; గగన ది
క్కుల్మ్లానమై; దుస్స్వనులై
మోగెం దూర్యములుం దమంతనె; రణం
బున్ గెల్వ హాస్యాస్పదం
బై సంవర్తముగాఁ గనంబడియె; స
మ్యగ్ధైర్యముల్గుంగె; నా
యానం బగ్గలమయ్యె నిత్తఱి గజా
శ్వానీక యోధావళిన్.

(దృష్టింగిద్పి కౌరవసేన నుద్దేశించి) సేనానాయకులారా! ఒంటరిగ మొనలం దీర్చికొనుఁడు. మామా నానానా యుద్ధంబులను జనంబును నమర్చి నేసికొనుఁడు. పనుల నోపినయంతయుఁ గాచికొనుఁడు (నిష్క్రమించును)

(ప్రవేశము బృహన్నల యుత్తరుని తేరఁబట్టుకొని)

ఉత్త— అయ్యో! బృహన్నలా! (వదలుము)

శా॥ అంగంబుల్ చెమరించె; నాల్క దడిలే
కారెన్; బదద్వంద్వ మొ

భంగి న్నిల్పుటలేదు; గుండె పగిలిం
పం గొట్టుకాడెం; దలం
పంగం జిత్తము రిత్తయై చెదరెఁ; గొం
పా మున్గెఁ నీ పుణ్యమా
యెం గన్నుల్గతి దప్పె నన్వ్యడువుమా
యెంతేనిఁ బ్రార్థించెదన్

క॥ నగపాలు రాజ్యమొసఁగెద
నగుబాటుగ శత్రుకోటి నడుమన్నను ని
ల్పఁగవద్దు! బృహన్నల! యీ
పగఱ జయింపంగ బ్రహ్మవశమే! యరయన్.

బృహ—(నగుచు) ఉత్తరా! [భుజంబుదట్టుచు] భయంబు జెందకుము.

శా॥ కట్టా! మానుషులెంత గౌరవులతోఁ
గయ్యం బసాధ్యంబయేన్
జిట్టాడంబని లేదు నీకుసుగు మా
జిన్నాకసారథ్య సం
ఘట్టంబూనుము కౌరవేశ్వరుల ను
ద్ఘాటించెదన్ వ్రేల్చెదన్
దెట్టిం జావుల గ్రమ్మఁజెంచెదను సం
దేహంబు వోవిడుమా.

ఉత్త—అయ్యా! నీకేమివెట్టి బృహన్నలా! చెప్పవలసిన నీకుఁడోఁచలేదు'

శా॥ జీవేచ్ఛన్ విడనాడనేరఁడవు; ననున్
జీవింపఁగా నీయవ

మ॥ మనమందించుక భీతి లేకిటు కురు
క్ష్మాపాలు కంటం బడన్
గావమే వీని? నా సుయోధనుఁడు లో
గుత్తించనేనిం గటా!
వనికిం గ్రమ్మఱ ద్వాదశాబ్దములుఁ బో
వన్వల్వదే భీష్మ! యు
ర్జునుఁ డొండుం దెలియం దహంకరణమే
సుమ్మిద్ది యాలింపుమా.

[ ప్రవేశము కర్ణ దుర్యోధనులు ]

భీష్మ—కుంభసంభవా! నీవు సందియముపలుగు [దుర్యోధనునింజూచి] కాళకేయా! [ద్రోణుని గ్రీగంటఁజూచుచు]

మ॥ అరులన్ దవ్వుగ దాటివచ్చితిమి భీ
యావంతయున్ లేకిటన్
జరియింపందగునింకఁ గౌరవవతం
సా! విస్మృ శత్రుల్ పొరిం
బొరి పై కిం జనుదెంచినన్ నిలువ నో
పన్ సైన్యమిందేని; నొ
క్కరుఁడై రాఁగనుపట్టె నెవ్వఁడో యెు
ఱుంగన్ రాదు రాజంపఁగాఁడ.

ద్రోణు—[తనలో] కర్ణాదులచే నివృత్త సందేహుండనైతి.

దుర్యో—ఆచార్యా! అట్టిశంక కర్తవ్యంబు కాదింపుడి

ద్రోణు—మిక్కుటిపైన గొంటఁగఁజాలు బలశాలుండగు నగ్నసుండెవాఁడు మనయందరికి నకేయుఁడు.

కర్ణ—[క్రుద్ధుఁడై] ధనుర్విద్యాగురూ!

శా. ఇంటన్ మెక్కియు నింటివాసముల నీ
వేనాఁడు లెక్కింప వీ
గొంటున్ బంటుతనంపుఁ బల్కుడుగు మే
గుండేరు చో బ్రహ్మయేన్
వింటన్ బాణముగూర్చి ప్రాణముల వే
వేగొందు నీవిందు నన్
వింటే! యర్జుని గిర్జునిం బొగడకే
విచ్ఛేయుమా! వీటికిన్.

భీష్మ—కర్ణా! శాంతింపుము. ఎవరెవరిబలంబు లెక్కడో యిప్పుడే తేలును.

చం॥ అరయఁగఁ బార్థకర్ణుల బ
లాధికుఁడెవ్వఁడో ద్రౌపదీ స్వయం
వర సమయంబునందుఁ గన
వచ్చెను గొంత; కొంతనేఁటి సం
గరమునఁ దేటతెల్లమగు
గం(డతనంబుగఁ బల్కినంత మె
త్తురె నిను? శూరతన్ రిపు ని
దుర్గ్కానఁగావలె గెల్వఁగా వలెన్.

కర్ణ — సురనదీపుత్రా! చిన్నతనంబునుండి కౌంతేయులఁ జేతులనెత్తి పెంచిన కరంబున నిట్లు మాటాడెదు.

ఆ॥ గీ॥ చేసికొనిన యింతి సిగబట్టి సభకీడ్వ
మిన్న కుండి రోశ్క సెన్నఁగనక
నెత్తిఁ జేయిగొనుచు నొత్తిగిల్లుమటన్న
నడవికేగిరంత బదుగులగుచు.

భీష్మ — ఆ ధర్మజాది వారికోక తలవంపాటు గ్రామాజ్ఞానువర్తనులైరి సత్యవాక్య పరిపాలనా దురంధరులైరి ఆపదకువ జాటించిరి. మీకు వారు లొంగి లోకమును వారివశీకరణముగ నుంచికొనిరి సత్యార తను వెల్గడించిరి

కర్ణ — నీపలుకు లెప్పు డిటులనే యుండును.

ఉ॥ నిండుసభన్ సతీమణిని
నెట్టుకవచ్చి శిరంబుబట్టి పో
కుండఁగఁ గట్టు పుట్టముల
నొల్చిననాఁడును లేడె వీఁడు? పా
ర్థుండన నేఁడు బాహుయుగ
దోర్బలియా? తల వాల్చి భీముఁడు
ద్దండుఁడు జచ్చి యుండఁడె? ప
దంపడి యేటికి రజ్జులిత్తితేన్.

(దుర్యోధనునితో విన్నవించును)

భీష్మ — [ద్రోణునితో] ఆచార్యా!

ఉ॥ కయ్యము ముందుబుట్టె వెను
కన్ మన కర్ణుడుపుట్టె; సేవిధిన్

నెయ్యము మించి కూడి మన
　　　　నేర్తురు కౌరవపాండవుల్ ? తలల్
వ్రయ్యలు కాఁగలట్టి తఱి
　　　　వచ్చెను; వృద్ధులపల్కు లన్నఁ జే
దయ్యెన మా సుయోధనున
　　　　కక్కట! దయ్యముసేతయెయ్యదో.

(నిష్క్రమింతురు)

గద్య

శ్రీ......... .... .. ......రామానుజాచార్య ప్రణీతంబయిన
శ్రీమదుత్తరగోగ్రహణంబున ద్వితీయాంకము.

—

శ్రీ

# ఉత్తర గోగ్రహణము.

## తృతీయాంకము.

— (0) —

స్థలము మైదానము

(శమీవృక్షము. పాండవుల యాయుధములు శవాకృతిం జెట్టుపైనుండును)
ప్రవేశము ఉత్తరబృహన్నలలు రథారోహణులై.

బృహ— ఉత్తరా! రథంబీ శమీవృక్షచ్ఛాయ నిలుపం జేయుము

[ఇరువురు రథంబుడిగ్గి]

శా॥ కంటే! యుత్తర! జమ్మిచెట్టుఁ గడు శా
ఖాశోభితంబై నభం
బంటెన్; భూతపిశాచవాస బహుయో
గ్యంబయ్యె వైరాటి! ము
క్కంటిన్ గెంటఁగఁ జాలునట్టి శరమా
గాండీవ మిందుండె; నే
నుంటిన్నీకు భయంబులేదు తరుపై
నుత్సాహితం బ్రాకుమా.

అక్షయతూణీయుం జాపంబు గ్రహించితివేని యట్టి దంతి తురగాద్యనేక జంతు సంతానంబులైన సంహరింపందగు. ఏ వీర్యాగ్రేసరుం డరుదెంచినఁ గండకండలుగఁ జెండి కసుపండువటో ఐరావద్దండముల మాదుము. [చెట్టుపైకిఁజూచుచు] నా (కేలివంక నే చూడుము. శవాకృతిం గనంబడుచున్నది అందు భీమార్జున నకుల సహదేవులు తమ యాయుధంబుల నీవిధంబుగ నిందు దాచిపెట్టినవారు ఈ కట్టువిప్పి గాండీవంబు తాకంటియిచ్చి తదితరాయుధంబుల నెప్పటియట్ల బంధించి యుండే యుంచి రమ్ము. ఉత్తరా! జాగొనర్పక వడివడి వృక్షమున కెగబ్రాకుము.

ఉత్త—[తలవంచుకొని సందేహించును]

బృహ—ఏమి యా కాలయాపనము?

ఉత్త—బృహన్నలా!

ఉ॥ అక్కట! శీఘ్ర నంటఁదగు

నా యిటు? రాకొమరుండ; భీతియున్

దక్కితి నీచవృంబనిక

దార్చెదవన్న! ననున్ బృహన్నలా!

యొక్కటనాన్యాయమా? ఘనమ!

యోజననేయుము పాపకర్మమై

దక్కనుగాదె నీకిది; వ

దంపడి భూపతివిత్త్వ దక్కదే?

బృహ—అయ్యా! యింత వెఱ్ఱివాఁడవు. నిజంబుగ నిన్నిట్టి యకృత్యమున కనుపుదునా?

మ॥ అవనీనాథకుమార! యాననవిన యా

ట్లా వృక్షమున్నదే

బున నిచ్చిన యూపదశవర్షంబు పండ్రెండేండ్లు వనవాసులై యొక్క-యేడజ్ఞాతవాసంబు సలుపఁగా వచ్చి యీనగరంబునఁ దాగియున్నవారు.

ఉత్త—(విశ్వాసముతో) బృహన్నలా! దయచేసి వారిఁబరిచయింపఁజేసిన నీకు కృతజ్ఞుఁడను.

బృహ—(తనలో) వీని వైఖరింజూడఁగాఁ గౌరవుల కంటఁబడక యింట్లో తిప్పించుకొనునట్లుండె. వీఁడు మూఢాత్ముండుగానిచో నింతవఱకు నన్నేల గుర్తింపకుండు? (ప్రకాశముగా) ఉత్తరా! వినుము

ఉ. కంకుఁడు ధర్మజుండు; హయ
కందళ గోగణ శిక్షకు లవల్;
బంకుఁడ! విన్ము నీ నగరి
వంటలవాఁడనిలాత్మజుండు; నీ
కింకఁ గొఱంత పెట్టుదు నే
యేను ధనంజయుఁడన్; విరాట్సుతా!
కొంకక యాహవంబునకు
గోఁక సేయుము జమ్మి వీడుమా!

ఉత్త—అటులయిన ద్రౌపది యెవ్వరు?

బృహ—కం. మాలిని యనుపేరం బాం
చాలి గృహంబున నొనర్చు సైరంధ్రిపనుల్
కూలఁచఁడె కీచకుల నా
కాలిక కొఱకు వలలుండు గంధర్వులనన్.

ఉత్త—బృహన్నలా! అన్నదమ్ములగు దర్శనంబు లెవ్వరూ తెలుపుడు జేసి నమ్మిగ.

బృహ—ఆకర్ణింపుము. అర్జునుడు ఫల్గునుడు పార్థుడు శ్వేతవాహనుడు
కిరీటి భీభత్సుఁడు విజయుండు జిష్ణుండు సవ్యసాచి ధనంజయుండు.
ఇవియే నా నామంబులు

ఉత్త—పాండవమధ్యమా! నీకీ నామంబులు కెట్లు సంభవిల్లెనో చెప్పుము.
అప్పుడు నీవు నిక్కముగ నర్జునుండవనియే విశ్వసింతు.

బృహ—అట్ల చేయుదు

క। క్షితిఁ గెలిచి సిరులఁ జేఁగొను
కతంబున ధనంజయుండఁ; గదనంబున యుం
దతి బలశాలుర గెలిచెడి
కతనన్ విజయుండ నంచు ఘనత వహింతున్.

క। ధవళంపు వాహనము లా
హవమున మద్రథమునందు నలరుటచే వా
సవుఁడిడిన కిరీటము తల
ను వఱలఁగాచె శ్వేతవాహనుండఁ గిరీటిన్.

క। అని భీభత్సముగ మెలం
గినఁ దతి భీభత్సుఁడ; నిరుగేలను బాణా
సనమూని పోరుకతనన్
జనియించెన్ సవ్యసాచి శబ్దము నాకున్.

క। అరయ నవదాతవర్ణము
దొరకొనఁగా నర్జునుండ; దోహలముగ ను
త్తర ఫల్గునీ నమయమున
నిరవొందఁగఁ బుట్టుకతన నే ఫల్గునుఁడన్.

క॥ అనిమిషులనైనఁ బరిమా
ర్తును గానన్ జిష్ణుఁడన్; విరుద్ధము గాఁడీ
యమునటలు; మదంబునం బృథ
యను పేరుంగలుగు కతన నల పార్థుండన్.

ఉత్త॥ ఇప్పటికిఁ గంపించితివా?

శా॥ గాంధారీసుతుఁడౌ సుయోధనుఁడు బల్
గర్వాంధకారంబునన్
గంధర్వేశ్వరుచేతఁ బట్టువడి త
త్కాంతాజనంబుల్ జెలుల్
బంధుల్ జిక్కఁగ నొక్కరుండవ యరి
వ్రాతంబుఁ దూటాడి త
ద్బంధంబుల్ విడిపింపఁ జేసితివి మ
ద్బాహూత్కట ప్రౌఢిమన్.

ఉత్త—మహానుభావా! (వృక్షంబుదిగ్గనుఱికి యర్జును పాదములంబడి)

శా॥ శూరాగ్రేసర! శత్రుమర్దన! రిపు
క్షోభంబు గావింపు; మే
లా రమ్మింక నెఱుంగకే నిను వృథా
లాపంబులం బల్కితిన్
గారామారఁగనన్ క్షమింపుము! లస
త్కారుణ్యపాథోనిధీ!
ధీరంబుందగఁ జూపు కాలమిదె చే
వే నన్గ్రహింపంగదే.

అర్జు— (వాని కేతనత్తి కాగిటఁ జేర్చుకొనుచు)

ఉత్త— ఉ॥ పాండవమధ్యమా! రిపువి
భంజన! శంక దొఱంగినాఁడ; ను
ద్దండుఁడవై విరోధులను
దార్కొను మే రథచోదకుండనై
పండువ సేతుఁ; గౌరవ నృ
పాలు నదల్పుము; గోగణంబు నీ
కొండవు ద్రిప్పుమా! జయము
గాంచుము మెచ్చఁగ ద్రోణభీష్ములున్.

పెద్దకాలంబునుండి ధనంజయునకు సారథ్యంబు సేయు కుతూహలం
బుండె. నేఁడు నామనోరథంబీడేరు తరుణంబె విక్రమంబుగవచ్చె.

శా॥ మామా! తేరు పయిన్ వసింపుము కురు
క్ష్మాపాల సైన్యాటవీ
భూమధ్యంబున నొక్కఱుంకెయిడి యే
పుంజూపుమా! దంతివై
భీమంబుం బులివై మృగేంద్రమవయై
విఖ్యాత కౌరవ్యవం
శామందాన్విత ధూమకేతు ధృతగా
ఢాగ్రాత్మజుం ద్రుంచుమా.

అర్జు— కాంతేయాగ్రజసంభవ బ్రహ్మచర్యవ్రతనియమ పూర్వకాపవిహితం
బగు రూపంబు దాల్చి యొక్క యేఁడాది నజ్ఞాతవసంబు సమాప్తిఁ బొందిం
చితి. ఆ తరుణంబున నా చందంబు లోకులకు వేడికయంబయి చూపట్టె.
ఉత్తరా! అదియును నిటమీద కేమి॥

ఉత్త—(సంతసించి) ఆర్యవర్యా! ప్రియమాదయానమానసుండనైతి. ఇట్లు కల రెండుగల్ల నాకుంటలి నాచెప్పుట నా చెసగల దయ పెంపు మూర్ఖ యగుదు. భవద్బాహుబలంబుగలుగ నింక సురలకైన శంకసేయను ధనంజయా! ఇంక నాకుం బనియేయున్నది?

అర్జు—గాండీవంబుదక్క తదితరాయుధంబుల నెప్పటియట్ల కట్టిపెట్టి రమ్ము. నీసింహపతాకంబుఁగూడ నందేయుంచుము

ఉత్త—(అట్లుచేయును)

అర్జు—(తనయచంబు ఆయుధంబులు ధరించి) వానరాకారంబగు మహోగ్ర కేతనంబునకై యగ్నిదేవుం దలంతు (ధ్యానముచేయఁగా కేతనము తన ముందు వచ్చిపడును. దానిం గైకొని) ఉత్తరా!

శా॥ జెండాపైఁ గపిరాజు దంష్ట్రమగఁడై
చెన్నొందఁగా, దిక్కులన్
నిండన్ బేతములుండఁగా, విజయునిన్
నిర్జింపఁగాఁ జాలఁడై
న్నండుం గొడలతేని యల్లుఁడయినన్;
రాధేయుఁడున్ రాయఁడన్
భండుల్ నిల్తురె భండనంబున ధరా
పాలాత్మజా! యుత్తరా!

దీనింగొని రథంబునకుం గట్టుము. (ఇచ్చును)

ఉత్త—(రథమునకుఁగట్టును)

అర్జు—(తనలో) ఇంక మత్కిరీటంబునకై యింద్రునిఁ బ్రార్థింతు (ఇంద్రుని ధ్యానింపగుడు కిరీటము వచ్చియుండును. దాని ధరించును) ఇంక దేవ సంఘంబొసగిన శంఖంబు రావేచుచుంటిని. (శంఖము వచ్చును. దానిం జేకొనుగాని)

శా। లేలెమ్ముత్తర! శత్రువర్గము దె ప్రో
　　　　లిన్ దాటి దూరస్థమై
యాలీలం జనుచుండె; సారథివి గ
　　　　మ్మా! మేల్విచారింపుమా
"ఆలస్యా దమృతం విష"మ్మనెడి ప
　　　　ల్కాలింపుమా! యేను దో
ర్లీలన్ వేగమ దేవదత్తమును బూ
　　　　రింతుఁగా రిపుల్ భీతిలన్.

(దేవదత్తమును బూరించును)

ఉత్త—(మూర్ఛబొందును)

అర్జు—కట్టా! ఇంతమాత్రమునకె వీఁడిట్లు మూర్ఛఁ బొందెనేమి? (చెవులు మూసి)

శా। మాన్యుండీతఁడు లేత కుఱ్ఱఁడహహా!
　　　　మత్స్యక్షితీశాత్మజుం
డన్యాయంబుగఁ జాపకట్టుగఁ బడెన్
　　　　వ్యక్తుండెటుల్ కాఁగలం
డన్యుండే? కులభూషణుండు మఱి మే
　　　　నల్లుండు; కట్టా! విధీ!
జన్యంబెల్ల వృథాయొనర్చెదవె? యా
　　　　శా చక్రిమల్లాడఁగన్.

(మెల్లగా) ఉత్తరా! ఉత్తరా! విరాట్నందనా! ఏమి నీ మేన ప్రాణములు నిలుచుండలేదు?

ఉత్త—(కనులు తెరచి చూచి కూర్చుండును)

అర్జు—ఓయీ! ఎన్ని సమరంబుల జూచితివి. శంఖభేరీనినాదంబు లెన్ని వింటివి కోటికి గ్రొత్తలేయున్నవి?

ఉత్త—(లేచి) మహానుభావా! పూర్వమేను శంఖనినాదంబులు విందు. భేరీనిస్వనంబులు వింటి. గజేంద్రబృంహితంబులు విందుఁ గాని నేఁడు భవదీయ శంఖారవంబు చిత్తవ్యామోహమొనరించె దేవా!

శా॥ సప్తాంభోనిధులుం గలంగ గిరులెం
చన్ సంచలించెం గడున్
త్రిస్తంభమ్యో వసుంధరావలయ మా
జిం దారికల్ రాలె; నా
త్రిస్తంభై యమరావతీపురి వడం
కెన్;లోకముల్ బెగ్గిలెన్
దప్తుల్సుప్తులునైరి దేవతలుఁ బా
ర్థా! నాదు మాటేటికిన్.

అర్జు—రమ్ము. రథారోహణులమై రణంబు సేయం జనుదము. ఈవు హయంబుల నదల్పుము. (నిష్క్ర-)

2 స్థలము. మైదానము.

భీష్మ ద్రోణ కృపాచార్యాశ్వత్థామ కర్ణ దుర్యోధనులు.

ద్రోణు—(అర్జునుని శంఖరవము విని) యథార్థంబుగ నావచ్చువాఁడు పార్థుండే! వాని శంఖారవంబు బ్రహ్మాండభాండమును బగిలించి ప్రాణి కోటికిఁ జైతన్యముంగూర్చె గాండీవ దేవదత్త కపిధ్వజంబులే యవ్వాఁడు ఫల్గునుండని చెప్పుచున్నవి దుర్యోధనా!

శా॥ వచ్చె న్నిక్కముగా రణంబునకు భీ
భత్సుండు బీభత్సుఁడై
పొచ్చెంబుండదు నాదుమాట కనికిన్
బుచ్చన్ బలోద్దండులన్
రచ్చన్నిల్పుము నిచ్చలాహవవిన
న్నద్ధుండు కర్ణుండు నేఁ
డిచ్చోటం గలవాఁడు నీకగు తెఱం
గెల్లన్ విచారింపుమా!

కృపాశ్వత్థామాదిరథవరులారా! ఇత్తఱి వివాదము సేసినఁ బోవదు వచ్చెడువాఁడు ఫల్గునుఁడు గాన నవశ్యకర్తవ్యం బాలోచనీయంబు. ఇదియుంగాక నేఁడు మన మొనలయందు దుర్నిమిత్తంబు లనేకంబులు దోఁచె. రణంబు మనకగుట యనుమానంబు. ఇదియెల్లఁగనంగ మనంబున నాకొండుపాయంబు తోఁచెడు.

దుర్యో—ఆచార్యా! సెలవిండు.

ద్రోణు—నాకు తోఁచినది యని నచ్చిన విషయంబు వచింతు మీరును దఱిది ప్రస్తుతాంశమును వ్యక్తీకరింపుఁడు.

ఉ॥ రాజు పరాజితుండయి దు
రంత విపద్దశఁ జెందరాదు; వి
భ్రాజముగాఁగ సైన్యమును
బంచి సంగంబును గోవ్రజంబునున్
రాజునకిచ్చి పంపుదము
రాణదవర్పఁగ ముందు; నాపయిన్

ఆజికి నిల్తుమింపు మన
మందలి మర్జును తోడఁ గోరఁగాన్,

అందఱు—మాకు నదియె సమ్మతము.

దుర్యో—మరల నిదేమి?

మ॥ నికృత ద్యూతమునం బరాజితులు పం
డ్రెండేం డ్లరణ్యంబునం
దాక యేడాది నిగూఢవృత్తిగను నెం
దో ప్రొద్దుబుచ్చన్ నియా
మక మానాఁటిది కాదె? నేఁడిటు బలో
న్మత్తుండయై మూఢుఁడై
వికలుండై యరుదెంచు చుండెఁగద యీ
వివ్వచ్చుఁ డేపాటియో.

ఇవ్విధంబుగ నర్జునుండు తన్ను దా వెలిఁగించుకొనెంగాన కులల భ్రాతృసంయూతంబుగఁ బదమూఁడేండ్లు వనంబునకే క్రమ్మరవలయును.

ద్రోణుఁ—అది యటుండనిమ్ము, అర్జునుండన బాహాబలపరాక్రమంబుల నసహాయుండు

దుర్యో—ఆచార్యా!

మ॥ తురగంబుల్ గజముల్ రథంబులును రౌ
ద్రుల్గల్గి యున్నార మిం
దఱ మశ్వాఁడాకిరుండు పార్థుఁడు రణో
ద్దండుండుగా నేమి? యే

శరసంధానుఁడు నైననేమి? నృపతి
త్రాణమ్ము జక్కించెనే
పురినేర్విన్నను సవ్వరే! కురుకులం
బున్ వన్నె గోల్పోవదే!

పెద్దలేవాఁడైన గార్యంబును సామంబునఁ జేయసమకట్టుదురే! కాని కయ్యంబుపట్టున వారియాలోచన సమంజసము గాదు. వివేకవంతులు గృహంబున సుఖాసీనులైయుండి భోజనావసరోక్తులను నీతిశాస్త్ర కథాకలాపంబులను బలుకుటయే కాని యుద్ధసమయంబున బోరాడు వారు గారు. అందు మీరాచార్యులవారు. ఈ వచ్చువాఁడు నిజంబుగ నర్జునుండె. ఐఁను

శా॥ సంభావ్యుండగు వీఁడు రాఁగతము రో
షంబొండె రాజ్యాభిలా
షంబొండెన్ మఱియున్నె? కౌరవ కులా
చార్యుండవై వంది చం
దంబాశ్రితవు నీవిధిం బొగడి పె
ద్దం జేయనేలా? కడున్
సంబాళింతువు మెచ్చుకొందువు కురు
క్ష్మాపాలుఁ డగ్గించఁగాన్.

అశ్వ—(క్రుద్ధుండై) ఓయీ! రాజా!

శా॥ చూడం గావలివాండ్రఁ గొట్టి పసులన్
శూరుండనై పట్టి కొ

న్నాదం గాదయటంచు నీవెడనుడిం
జాలింపుమా! వీటికిన్
దోడంజేరవు వైరిఁగెల్చి చనఁగా
దోశ్శక్తియా లేదు పై
నేఁడీసేనలు నిల్చెనే యని కడిం
దిం గుందు దిప్పట్టునన్.

సంగ్రామరంగంబున నిల్చి యురుని రాజ్యంబు గల్చిన శూరుండీ మాడ్కిఁ బలుకఁడు. ధార్తరాష్ట్రాగ్రజా! మాయాజూదంబున నైశ్వర్యంబుం గొన్నాఁడవు. రాజ్యమా బట్టుకొంటివి ఈ తరుణంబున నీకెజ్జోటికి? ఇఁకఁ దొల్లింటిభంగి గాగు. సమయంబు డగ్గరియె.

శా॥ పాండుక్ష్మాపతి కోడలిన్ సభకు నీ
డ్వ్యందెచ్చి ఫుట్టంబులన్
మొండుం బ్రోవులుగాఁగ నొల్చుటకు దు
ర్నీతిం బురింగొల్పి నా
లెండే సౌబలుఁ డొక్కరుండ యరి యు
ద్ధంబునన్ గెల్చుఁ గా
కొండేలా? యిటుఁ జూతుమెల్లరము కా
రో? పండొ? తెల్లంబగున్.

మ॥ గురుఁడీమాన్యుఁడు శిష్యుఁడా బలుఁడు మా
కున్ వాని శ్లాఘించుటల్
భరమే? దోషమె? దాసికై యనఘు నీ
భంగిం, బళంసించదే?

కురురాజా! లవమేని లజ్జపడ కీ
కుంభోద్భవుండాలమి
త్రితిఁ దాఁ జేసినఁ జేయుఁగాక యిదిచి
త్రంబందు నే నోర్తునే?

ఇది యంతయు నేల? తన యాలకుందలంగొన మత్స్యకుహాపాలుఁడు చనుదెంచిన వాతనితోఁ బోరాడదముగాని యీ కిరీటితోఁ దలకొనుట కేమెంతయు నిచ్చగింపము.

కర్ణుఁ—(సక్రోధుండై) ఔరా! యేమి యీ నీతిశాస్త్రకోవిదుల ధర్మాధర్మ విచక్షణముల.

శా॥ మున్నీరెల్ల రోడింబడంగఁ గద యీ
భూనాయకుండిట్లు వ
చ్చె నిక్కంబుగ మీరువచ్చితిరి; యి
స్సీ! ఫల్గునుం జూచి యు
న్నన్నా, వాని నుతింతు రిప్పుడు భళీ!
న్యాయంబు వక్టోటఁ బో
దన్నన్; ద్రోణ సుతుండు రాజునిఁక నిం
దం బుచ్చఁగా నేటికిన్.

శా॥ భీతిం బొందుదురేని విల్లువిడిట నే
వీర వ్రజంబెల్ల; ని
ర్ణీతం బొక్కని కొక్కరుండకద! యీ
నీతిజ్ఞులేలా? యిఁకం

జేతో మోదము గూర్ప నొక్కఁడ నరిం
జెండాడఁగాఁ జాలుదున్
దాతల్ నేతలు నొత్తిగిల్లుఁడి తలన్
బాల్యోపి వట్లయ్యెడిన్.

పాండవమధ్యముని బాహాబలవిక్రమంబులు ధరామండలిం బ్రసిద్ధికెక్కియున్నవి ఎటుఁ గురుసైన్యంబున శౌర్యవంతుండనై పరగుదు జనంబు లాయురవురిలో బలాధికుండెవ్వాఁడని శంక సేయుదురు కాన నేఁడాతని నీ కర్ణుఁడెదుర్కొనుటయే యుచితంబు. యోధాగ్రేసరులారా!

చ॥ కురుపతి యుప్పుదీరఁ బలు
కుల్కును నాడిన వెల్ల నిక్కమై
పరగఁగ, జామదగ్ని కడ
వాసిగ నేర్చిన యస్త్రవిద్య యి
త్తఱి కలయంగ నొక్కరుఁడఁ
దాకెదఁ బార్థుని నిష్టమున్న వా
రరయుఁడి లేనివారికిఁ గృ
హంబుల కేగుడి గోగణంబుతోన్.

కృపా— రాధేయా! చక్కఁగ పలికితివి

శా॥ కాలం బ్రద్వేద వెప్పుఁ గయ్యమున కో
కర్ణా! బుధుల్వాతు రీ
యాలం బత్యధమాధమంబుగ; నృపుం
డాపుండు నీకందుచేఁ

ప్రేలాపంబుల లెన్నఁడో తెలిసె; దో
ర్వీర ప్రసంగంబు లిం
కేలా! యున్నబలాబలంబులను ము
న్నే మెల్ల వీక్షింపమే?

సీ॥ ఒక్కరుండేకదా యుక్కఁజూపి యొనర్చె
శక్రాది సురలతో సంగరంబు
ఒకఁడేకదా యాదవోద్దండుల నదల్చి
గరువంబుగ సుభద్ర కరముఁబట్టె
ఒక్కఁడేకద నాల్గుదిక్కుల జయ మొంది
కురువంశమునఁగీర్తి గూర్చె మిగుల
ఒక్కరుండేకదా సుయోధను విడిపింప
గంధర్వ పతిఁబట్టి గర్వమడఁచె

గీ॥ ఒక్కఁడె నివాతకవచుల నొడిసిపట్టెఁ
గాలకేయుల నొక్కఁడే కాల రాచె
నొక్కరుఁడె నేఁడు కురుసేన నోటఁబుచ్చి
పసువుల మఱల్చుకొని పోవువాఁడు కర్ణ!

శా॥ ఒక్కండంచుఁ దలంతు; ద్రౌపదికి నై
యుర్వీపతుల్ పోరి న
ల్దిక్కుల్ పాఱరె? చేవఁగోలుపడి; రా
ధేయా! యటన్ నీవునున్

నిక్కంబుంటివా ? లేవా ? చెప్పవదు వె ? కుం
తీ పుత్రు లొక్కొక్కరుం
డుక్కుంజూపిరి పెక్కుతావులను నీ
కుద్వృత్తి నేఁడేటికిన్ ?

అతి సాహసంబు వలవదు. ధరాధిశ్రుం గావఁగ వలెను. గాన గురు భీష్మాశ్వత్థామ సుయోధనులును నీవును నేనును గూడి క్రీడిం దాకుదుముగాక ఒంటిగఁ గిరీటి నెదుర్కొనుటకు ఫాలనేత్రునకయిన నశక్యము

కర్ణుఁ—కృపాచార్యా! దాగా సుత బంధు మిత్ర సహితంబుగ బ్రతికినన్ని దినంబు లేలిక బొక్కసమునుండి ధనంబు గ్రహించి మాప్రొద్దులఁ దృప్తిగా భుజింతురు అలంబుకతి రొగుకుదురు

శా॥ జన్నంబుల్సలుపన్ గృహంబునఁ గృపా
చార్యుండ! పోపొమ్ము; ప
క్వాన్నంబుల్ భుజియింపు; మే విలు కరం
బందూని డేకొన్నచో
నున్నే? క్రీడియు బోడియుం; బదియు నా
ల్గున్నే ప్రపంచంబు ? లీ
సన్నం బల్కెడు పార్థుఁ డొక్కరిధిక
స్పర్ధాళు వింతేటికిన్.

భీష్ముఁ—శూరవర్యా! కర్ణుండు బుజమార్గంబునఁ బలికె. అశ్వత్థామ తగినట్లు వచించె. కృపాచార్యుండు సజ్జన హితంబుగా మాటాడె. రాధేయుండు సంగ్రామార్హ వచో త్రితి వెలిబుచ్చెఁగాని మాన్యులనట్టు

ధిక్కరింపరాదు. తరుణమాసన్నంబయ్యెఁ గాని వైరిఁ బొప్పించి వీరంబు జూపఁదగుంగాక. చాటున నీచందంబుగఁ బలుకరాదు. అదియుం గాక.

ఉ॥ ఈతఁడు క్రీడి శాత్రవుఁడ
యేని గుణంబును గల్గి మెచ్చఁగాఁ
జాతుము; వృద్ధసమ్మతము
నూవె యిదెల్లను; ఫాల్గుఁడన్నచో
నాతఁడ బాహువిక్రముఁడు;
అందఱమిట్లు విరోధముల్గొనన్
నీతియుఁ గాదు; కార్య సర
ణిం జనఁగావలెఁ గౌరవాగ్రజా!

ఆచార్యులు పూజ్యులే యయినను గర్వులు గారాదు.

దుర్యో—(అందఱిం గనుంగొని) ఇది విరోధంబునకు తరుణంబుగాదు. మన మెల్లరము గూడికొని గణాలు సేయందగు. అరి నోటఁబుచ్చందగు.

భీష్ముఁ—అతిరథులారా!

మ॥ క్షమియింపందగు నేరి.నేరమునౌనం
గానేమి? భూనాథు కా
ర్యము మన్నింపఁగఁజెల్లు; నొండయిన యో
ధాగ్రేసరుల్మీర యా
ట మహాదుర్యశమెల్ల మీతలకె చు
ట్టన్ వచ్చు రారాజు; మీ

రమల స్వాంతులు రాచయవ్వ లోక చా
యం దీరఁగాఁ బోరుఁడీ.

కృపా—

శా॥ గాంగేయా! క్షమియింపఁగాఁ గురుకుల
క్ష్మాపాలు కార్యంబు జే
యుంగా నెవ్వర మెందఱుండినను ద్రో
ణాచార్య చిత్తంబు శాం
తిం గొన్నంగద! యింద్రజుం జని కడిం
దిం దియ్య తియ్యంగ వె
చ్చంగా నిద్దురఁబోదు మే మురక ని
చ్చల్చుండఁగా నేటికిన్.

దుర్యో—(కర్ణునితో మెల్లఁగ)

క॥ ప్రార్థింతు గురూత్తమ!
వ్యర్థము మనలో మన కిటువంటి కలహముల్
పార్థు గెలిచి గోనందో.
శార్థము నిలుపుము క్షమింపు మనఘా నన్నున్.

ద్రోణుఁడు—పార్థివా! భీష్మాచార్యుని వచోమాధురిగరిమ చేతనే శాసనం
బునఁ గలంకము దాఁటితి క్రీడి ఘోరకాంతారవాస కతం
బునఁ గడు గాసిలియున్నాఁడు, పాండుతనయుల యజ్ఞాతవాస కాల
సమాప్తి నిర్ణయమునకై భీష్ముఁడు ప్రార్థితుఁడు

భీష్ము:—

మ॥ పదమూఁడేండ్లు గతించె, నేఁడనికి వి
వ్యచ్ఛంబై యేతెంచె, గ
ల్పైదమంచున్ వచియింపఁగాఁ దగదు యో
జింపఁగ రాలచ్చికై
కదనం బందుఁ జెనంగు నిర్వ్యరకుఁ గ
ల్గన్ వచ్చునే గెల్పు? న
మ్మది కిప్పట్టున సంధిసేతయె తలం
పన్ లెస్సయై తోఁచెడిన్.

దుర్యో:—

క॥ మనకుం బాంగుక్ష్మాపతి
తినయులకున్ సంధి పొసఁగఁ దలపదునే? నే
లను బంచి కుడువ నొల్లను
అనిదే నిశ్చయము బుద్ధి కాలోచింపన్.

ద్రోణుఁ:—ఇద్దివ్యశస్త్రంబులందు ధగాపాలునికంటెఁ గడుదవ్యగ యోజించు
వారెవ్వరులేరు మన బలంబున చాలవ పాలుంగొని యావులం దన
వెంటఁబెట్టుక భూపాలుండు ముందు జనవలెను

దుర్యో:—అటులొనరింతు

భీష్ము:—శీఘ్రముగఁ బొమ్ము

ఉ॥ కవ్వడి డాయవచ్చెఁ జనఁ
గావలె నీవును సత్వరంబు బొ

దవ్వఁగ; నేమిట న్నిలిచి
తాకుదు మూఁతని నాలమందు బల్
నొవ్వఁగఁ జేతు మిందఱము
నుక్కటఁ బొందక; మీఁదదైవమే
నివ్వటిలెన్; బళు వ్రీజము
నీ వెనువెంటన గొమ్ము భూవరా!

దుర్యో — (నిష్క్రమించును)

ద్రోణుఁడు — (రణశూరుల నుద్దేశించి)

తే॥ గీ॥ శౌర్యవంతులారా! రణోత్సాహులార!
ధ్వజములెత్తుడి మొనలు దీర్పఁగ నిలుఁడి
శరము లెక్కు వెట్టుఁడి కార్యసరణిఁ జనుఁడి
పాండవేయుం డిదే వచ్చుచుండె ననికి.

(అందఱు నిష్క్రమింతురు)

గద్య.

శ్రీ ...... ......రామానుజాచార్య ప్రణీతంబయిన
శ్రీమదుత్తరగోగ్రహణంబునఁ దృతీయాంకము.

—(0)—

శ్రీ

# ఉత్తరగోగ్రహణము.

## చతుర్థాంకము

స్థలము : యుద్ధభూమి

ప్రవేశము : రథారోహణులై యుత్తరార్జునులు.

అర్జు — (దృష్టినిగిడ్చి కౌరవసేనం బరికించి) ఉత్తరా! అటుకలయం గనుం గొనుము. తెల యీగలచందంబునఁ గౌరవసేన కాల్కొలంది నడచు చుండె. ఇందు సుతగళితసుండైన గాంధారీసుతుండు గానంబడఁడు. (ఇంకొక దిక్కుజూచి) అదిక్కుగాంచుము కొంతసేఁయు గోవులం గానవచ్చుచున్నవి సుయోధనుం డందుండవచ్చు. కురువృద్ధులం జూచి యోజన చేసెరి.

మ॥ కురుసైన్యంబును గొంతపంచి యొటుపై
గోవ్రాతముంబుచ్చి పం
పిరి దుర్యోధను వెంటనిచ్చి; తలఁపన్
భీష్ముండు ద్రోణుండు నే
ర్పరు; లీపార్థుని నేఁడు దాఁకుటకు నీ
భాగంబు నిందుంచి ని

ల్చిరివీ; రింతటిలోఁ బసుల్ తమపురిం
జేర్పంగ నీరోజనల్.

మన మీసమయంబున నివ్వీరవరుల విడిచి ముందు గోగణ సహితంబుగఁ జనుచున్న కురురాజు నడ్డగింపవలెను రమ్ము. (కొంత దూరము నడిచి) ఉత్తరా! నిలువుము

మ॥ కురువంశంబునకెల్లఁ బెద్ద మతి నా
కుం దాత భీష్ముండు; పొం
పిరివోవన్ మనమెల్లఁ, ద్రోణుఁడు ధను
ర్విద్యాగురుం డిప్పు డు
త్తర! యవ్వారికెఱింగి వల్లుగ లస
ద్భావంబు పెంపొందఁగా
శరముల్ రెండు పదంబులన్ బడఁగ నే
సంధింతు మద్బాణమున్.

(రెండమ్ములు భీష్ముని పాదములముంగు వేయును)

చూచితివా! ధరాధిప నందనా! సురనదీ కుమారుండు కుంగిపోని వగ వారవింగుండై నన్నెగ చూపునఁ గనుచున్నాఁడు. ఈవైపునకు రమ్ము ద్రోణాచార్యునింగూడ నట్లే ప్రసన్నునిం జేసికొందము. [రెండమ్ములు ద్రోణుని పాదములముంగు వేయును] కంటివా! అస్త్రశస్త్ర విద్యా గురుండైన కుంభసంభవుండు కరుణారసార్ద్ర హృదయుండై శ్రీగంట నన్ను పరికించి గాంగేయునికి సకుం జూపుచున్నాఁడు. ఉత్తరా! ఇచ్చట మనకుఁగల కార్యముం దీర్చితిమి. వీరితో మనకిని నేమియుం బనిలేదు. ముందుగ సేగి ధార్తరాష్ట్రాగ్రజునిం దాకుదము. రథంబు వడిగఁ బోనిమ్ము. (నిష్క్రమింతురు)

(అంత యుద్ధోదితులై ప్రవేశము భీష్మద్రోణులు.)

ద్రోణుఁ—సురనదీనందనా! అర్జునుండిత్తఱి సురప్రశంసార్హుండు.

భీష్ముఁ—వీఁడు మనమెఱుఁగని పార్థుఁడా! కుంభసంభవా!

క॥ గురుభక్తి భ్రాతృభక్తిని
సురుతర సత్యానురక్తి యుద్ధాసక్తిన్
వరలు జగద్బల శాలుఁడు
నరుఁడు మన మెఱుఁగని క్రొత్తనరుఁడే యనఘా!

ద్రోణుఁ—పెద్దకాలంబు మనలఁబాసియున్న కతంబున పాదద్వంద్వంబు మొదలంబడ రెండు శరంబులేసి కుశలప్రశ్నంబు గావించె

భీష్ముఁ—నిజంబుగ నంతియె.

ఉ॥ బుద్ధిని నా బృహస్పతిని
బోలు ధనంజయుఁడయ్యె వీఁ డసం
బద్ధములౌ పనుల్గొనఁడు
ద్వాదశవర్షములున్ వనంబునం
దద్దయుఁబుచ్చి యన్నయగు
ధర్మసుతాఖ్యున కిచ్చె రాజ్య సం
సిద్ధినొనర్ప వచ్చె మన
చిత్తములంగొనెఁ గుంభసంభవా!

ధర్మపరాయణులకు జయము చేకుఱును. (రోజించి పార్థుఁడు వేయిన తెన్నుఁగని) ఓహో! ద్రోణాచార్యా! మనతో రణంబున

డీలుకొన విరమించి కురురాజెందాక రథంబతివేగంబుగఁ దోలుకొని పోవుచున్నాఁడు. మన యాలోచనలు రిత్తలయ్యె. ఇత్తఱి మన మిచ్చట నాలసించినచో మోసంబగును.

ద్రోణుఁ—కిరీటి మనపన్నుగడ యూహించెనా?

భీష్ముఁ—ఎఱుంగకేమి! ఈవు చెప్పిన విద్యయేకదా! వానిం జూడుమా

ద్రోణుఁ—(చూచి) ఇచ్చట వేచియున్న శూరాగ్రేసరులపట్ల ననాదరముం జూపి దుర్నిరీక్ష్యుండై పాండవమధ్యముండా పసులపజ్జం బోవుచున్నాఁడు. వీనికిం గౌరవేంద్రుని యెడఁ గ్రోధంబగ్గలంబు.

క॥ మన వెనుకవచ్చి యిచ్చట
జనపతి గనమిన్ రథంబుఁ జయ్యన దోలఁగిం
చి నరుఁడు చనుచున్నాఁడటు
ననుమానము లేదు మోసమౌ నరపతికిన్.

గోముక్తిపడుటయే యోచితంబు. స్వామిద్రోహాత్ముఁడు పట్టువడినఁ గో మనముండియుఁ బ్రయోజనంబేమి? అటుపై నీపశువులేల? ఈధనంబేల?

భీష్ముఁ—(కౌరవసేన నుద్దేశించి) రణాగ్రేసరులారా! కృపాచార్యాశ్వత్థామాది యోధముఖ్యులారా! సైనికులారా,

మ॥ చనుచున్నాఁడదె యుగ్రుఁడై ఘన రణో
త్సాహన్ ధర్మరాజానుజుం
డనఘుం, డచ్చోటఁ గౌరవేశ్వరుఁ డొకం
డై యుండె యోజింపఁగా

వనికిం జాలఁడు గెల్వశక్యమిఁక కూ
రాధీశులారా! వడిం
జని రారాజున కడ్డముండుఁడి యరిన్
సాధింపుఁడీ క్రచ్చఱన్.

(తెరలో రణకోలాహలము)

ద్రోణుఁ—భీష్ము (నిష్క్రమింతురు)

(అంతఃప్రవేశము ఉత్తరార్జునులు)

అర్జు—ఉత్తర కుమారా! ఈకురువ్యూహమునందు వీరవరుల వేఱు వేఱు నిరూపించెద. వినుము. ద్రోణాచార్యుఁడు కాంచన మయవేదికతో బ్రకాశించెడి ధ్వజముగలవాఁడు. సింహలాంగూలముతోనభో భాగంబంటు కేతనముగలవాఁడా చార్యపుత్రుండు. అశ్వత్థామ కృపాచార్యుండుగనక గోవృషకేతువుగలవాఁడు. రాధేయుండుశంఖుప తాకంబుతో నొప్పారు మణిమయంబయిన పాము పడగవాఁడు ధార్తరాష్ట్రాగ్రజుండు. అత్యంతోన్నతంబగు తాళద్రుమంబుగల సిడంబువాఁడు గాంగేయుండు అగిదము గురునకు బ్రదక్షిణంబుగఁ బోనిమ్ము. ఇక్కువా మహాని యొడఁజేరి భయముం జేయుంజనదు.

చ॥ కురుకుల రాజ పుత్రికల
కున్ ఘనశిక్షకుఁ డగ్రగణ్యుఁ డీ
సరసుఁడు నాకుఁదాత శర
జాలము నేయునొ ? లేదొ నాపయిన్
అరయుదుఁ గాక ముస్నె యితఁ
డల్క వహింపఁగఁ జేయరాదు; సం

గరిమునఁ జూతమీ ఘనుని
గట్టితనంబు బలాబలంబులున్.

అతండు గురుపుత్రుఁడు. అశ్వత్థామ సురాసురలైన నతనింజూడ వెఱతురు కౌరవవ్యూహమునందతఁడు మేటియనంబరగు అతనంబడు మహాపురుషుండు కృపాచార్యుండు మతిప్రతిపక్షుండు. ధైర్యంబున ద్రోణాచార్యున కెనయగును. అదియుంగాక బాల్యమునుండి మాకాచార్యకము చేసె ఇఁక నిను చూడుము. కౌరవేశ్వరునకు కుడిభుజమై తనరు అమోఘుండై రాధేయుండు. ఉత్తరా! మనమివ్వారి నిప్పుడు కదలింపరాదు. సద్బాహుదర్పంబున నీతండు గౌరవసైన్యంబుల సంహరించెదఁజూచుచుండుము (గాండీవంబుబూని) ఓరోరీ! నిలుఁడు నిలుఁడు (కాదురిఁడై)

శా॥ కండల్గండలుగా శరీరముల మ
త్ఖడ్గంబుచేఁ జెండెదన్
గుండెల్ సూల్చెద గాండివంబుకరమం
దుగ్రంబు వేచుండె రా
గండు ద్రుండంత; దుండగీడులరు ధై
ర్య స్థైర్యము లున్నతు న
వ్వండు న్నిల్వఁడుఁ ఫల్గునుండిదె రణ
ప్రావీణ్యుఁడై వచ్చెడిన్

(ప్రవేశము కర్ణాశ్వత్థాములు)

అశ్వ—రాధేయా! చూడుము. మనసైన్యంబునఁబడి క్రీడి యెవిధంబుగ సైనికులను సంహరించుచున్నాఁడో.

కర్ణ—అశ్వత్థామా! ఇంతమాత్రమునకే యేఁదలపడవలెనా? అమ్మహాసైన్యంబునకే కరకాలంబయిన వచ్చి మీఁదమీఁదఁబడినచోఁ గ్రీడికతియేమగునునో యెఱుంగుదువా ?

అశ్వ—ఎఱుంగకేమి? మనజనంబున శిరంబు లే చందంబునఁ ద్రెళ్లుచున్న వివో కంటివా?

మ॥ పలుమాఱుల్ నిను నీవమెచ్చుకొని వే
భంగుల్ ముదంబొందు దీ
కలనం బాండవ మధ్యముండడె కురు
క్ష్మాపాల సైన్యాటవిన్
గలయం జొచ్చెను వేగమీవ పులివై
కర్ణా! ప్రతిక్షిప్తసే
నల సంక్షోభము మాన్పవే! విజయునిన్
వారింపవే! చూచెదన్.

కర్ణ—కలశజాత్మజా! ఈవు నన్ను దెక్కించుచున్నాఁడవా?

అశ్వ—ధార్తరాష్ట్రగణంబు కార్యభారంబెల్లనీశిరంబుపైబెట్టె. ఇప్పుడు నీకు వృధాగోష్ఠివా? ఇత్యాది నీతలకు మించినదయ్యె చేసి తనని దీపింపుము విచారింపుము.

కర్ణ—(కోపముగలవాఁడై)

శా॥ అశ్వత్థామ; కృపాణశస్త్రరణ వి
ద్యాధుర్యుండు రాధేయుఁడీ
విశ్వంబెల్లను డీకొనకే వెఱవఁ డీ
వీరుండు లెక్కా యికన్ ?

విశ్వాధీశ్వరుఁడేని వాసవుఁడయే
నిం దుర్నింతు నిక్కంబు; వే
గాశ్వాసింతురొ క్రీడిబోడిచిట వి
ప్రా; రిత్తబోనిత్తునే ?

(ప్రవేశము మహోద్రిక్తులై చిత్రసేన, దుర్ముఖ, గుర్జర, వికర్ణ, శత్రుంతప, గశ్శాసనాదులు).

అందఱుఁ—ఓరోరీ పాండవమధ్యమా ఆఖండలనందనా! నిలుము నిలుము
మాశరజాలంబుల నిన్నిదే మట్టుపెట్టెదము. (నిష్క్రమింతురు)
(వేరొకప్రక్కనుండి ప్రవేశము అశ్వత్థామ గురుద్రోణాదులు)

అశ్వ:—రాజా! ఉడికిది కూర్చుండలేక కొంపకుఁ గొలువి దప్పుకొంటివి.
అటు గనుము. యుద్ధమెంత తీవ్రముగనున్నదో! హా! హా! విజయుఁడు.
రణరంగంబున నిలుండమ్యో! కట్టా! శత్రుంతపుఁడుఁగూలె.

గురు:—కురుకుమారా! అక్కసీ కిందగినవాఁడు మనగా ధార్తరాష్ట్రుండే.
మనమేగి యాతని గనికిం బురికొల్పగము రమ్ము

అశ్వ:—రాజా! గడువుము. గాండీవి గపహోదరుఁడొ బోలుగోలి యుద్ధే వచ్చు
చున్నాఁడు. మనమిందుండఁదగదు (నిష్క్ర)

(ప్రవేశము: ఉత్తరార్జునులు)

అర్జు—

శా॥ శూరాలెం జ్విలరధుండు, దుర్యోధనుఁ డగ్
గ్లోలమ్యో; శత్రుంతపుం
డాలంబందునఁ జచ్చె; దుర్ముఖుఁడు నా
హాకారముల్ సేసె; ద్రో

ల్లీలన్వచ్చి వికర్ణుఁడుం దోలఁగె; గా
లింపన్ భళీ! బంటు లే
మూలన్ డాగిరో; గుట్ట పుట్ట కొకఁడై
పోయెం గదా యుత్తరా!

(తెరలో) ఓరోరీ! పాండుపుత్రా, ప్రగల్భముఁ గొట్టకుము

(అనుచు ప్రవేశము కర్ణుఁడు)

కర్ణుఁ—

శా॥ ఉన్నాఁడిద్యోడఁ గర్ణుఁడుగ్రుఁడు రణో
ద్యోగాను రక్తుంఁడు ని
ర్భిన్నప్రాభవుఁడిద్ధతేజుఁడు లస
ద్వీరుండవే నీ యసిన్
నన్నుం దాకుము చూతు నీమగఁటిమిం
బార్థా! ప్రగల్భంబులుం
జన్నే? చాలవు జాయచీరలను బుం
జం బిడ్డనాఁడేనియున్.

అర్జుఁ—(మహోగ్రుండై) వాచాటా! సూతపుత్రా!

శా॥ ఆనాఁడేనట ధర్మహానికి మదీ
యాగ్రాను జన్మోక్తికిం
గానీ యోడితిమీకటంచుఁ దలఁపం
గాఁబోకు రాధాత్మజా!

యీ నీ కేసరకోత లా సభలయం
దేగాక చాలింపు ఘో
రానీకంబున సిగ్గు; బాహ్యగతిఁ గ
న్నారంగ వీక్షించితే.

ఇప్పుడీ కేకరి దంప్పించుకొనియుదవో కాచుకొనుము (కర్ణార్జునులు ద్వంగ్వ యుద్ధము చేయుదురు)

అర్జు—(గాండీవము చేఁబూని)

తే. గీ॥ సూతసుతుఁడా! పలుకవచ్చు శూరుమాడ్కిఁ
బలికి నట్లానర్పఁగరాదు బహ్మకైనఁ
గడిమిఁ బాంచాలి మానభంగంబునాఁడు
నగిన ఫలము గందువుగాక! జగమెఱుంగ.

[బాణము విడుచును]

కర్ణు—హా. (అనిపలాయనుండగును)

అర్జు—(దేవదత్తము బూరించి) ఉత్తరా! చెంతకురమ్ము

ఉత్త—(వచ్చును)

అర్జు—

మ॥ కురుసేనాసమితిన్ రహస్యముగ వ
ల్కుం జెప్పెదుం; గర్ణుఁడో
క్కరుఁడే వాడిమగండు వాఁడెవరుగుం
గాంచెన్ భయంబంది; త

కౌరవులింకెందఱు రాజులయుంబు మనకే
యియ్యప్పరు నెప్పట్టునన్
వెఱగొందంబని లేదు నీకు వనిలో
భీభత్సుం డిందుండఁగాన్.

ఉత్త—అర్జునా ; నీశౌర్యంబును దేహంబును బలంబును గాంచినకొలంది నాకునంబెంతయు వెగ్గలి ఇంద్రియములు పటుత్వముఁదప్పె. ఇంక రథంబు గడపంజాల.

అర్జు—(నగుచు) ఏటికి నీకింత భయంబు? ఒకించుక శ్రమంబడి తేరున్నడపుము ఉత్తరా! అమహామహులింగనుము. విడుపు చేతులు వెడలుపుటకును గలిగి యున్నారదె

శా॥ ద్రోణాచార్యుఁడు నీతిశాస్త్రవిదుఁడౌం
దున్ శస్త్రవిద్యాగురుం
డే నాఁడేనియు బుద్ధి కంటెఁగడు నా
కెక్కుడ్బు సన్మాన్యుఁడో
భూనాథాత్మజ; పాండుపుత్రకుల మే
ముం జూడదచ్చిష్య సం
తానంబందున నగ్రగణ్యులము త
ద్ధ్యంబిద్ది యాలింపుమా!

(ప్రవేశము ద్రోణాచార్యుఁడు)

అర్జు—(సాగిలఁబడి మ్రొక్కును)

ద్రోణుఁ—ధర్మోస్తు విజయము. వత్సా! లెమ్ము.

అర్జు—(లేచి)

చ॥ అడవులఁ బెద్దకాలమిటు
లండజమ్ముం గడుగుందినాము పె
క్కిడుముల; నేఁటికిద్దిశజి
యే యని వచ్చితి ఫల్గునుండ శి
ష్యుఁడను విపన్నులందు గృపఁ
జూపుటయే మదిలెస్స; యల్గఁబో
కఁడి ఘనులీరు పక్షిత్కృప
ఖుల్ హరికేని వజేయులెయ్యెడన్.

మ॥ మును నీపై శరమేయఁగా వెఱతు; నే
ప్రొద్దున్ భవత్సూను కం
టెను నన్ గంగసుఁగూర్తు సంగరఁపు మే
టిం జేసి తీరాచవుం
బనికై గుర్వాత్రా గ్రుద్దులాడెడి నవి
శ్వాసుండ నాచార్య; నేఁ
డని శాఙ్గన్ దయచేయు మీవ మును వే
యుం బూనుమా! బాణముల్.

ద్రోణుఁడు—(ముందు బాణములు వేయును)

అర్జుఁ—(ద్రోణునితో యుద్ధము చేయును)

(తెరలో) పార్థ! అంతేనిలువుము.

(ప్రవేశము అశ్వత్థామ యుద్ధసన్నద్ధుఁడై)

శా॥ పోరాటంబులకట్టె యాత్మలలు సా
ముల్ జేసినేఁడీవిధిన్
ఘోరా! మూలఁగలట్టి యీ ముసలి న
ట్లస్త్రాబ్ధి నిమగ్నుఁగా
గారింతీవును నొక్క శూరుఁడవె? నీ
కన్ రమ్మిటుల్ చూతు నీ
సౌరాచార విశుద్ధ బాహుబల మ
శ్వత్థామ పీఁడియ్యెడన్.

(అశ్వత్థామార్జునులు రణము సల్పుదురు)

ద్రోణుఁ—(తనలో) అందేయుండి పిరికిలాబలంబులఁగాంచెద
(నిష్క్రమించును)

(ప్రవేశము కృపాచార్యుఁడు కోపదీక్షితుండై)

కృపా—పాండవమధ్యమా! నాతో తిరిగి పోరాడుము.

కం॥ బాలుండవలెండు మహిలో
నాలంబులఁ బెక్కు జాడఁడాచార్య సుతుం
డాలాయము వస్తదియుట
పాలనుఁడా: నీదు బాహుబలముం గాంతున్.

అర్జు—(నమస్కరించి)

మ॥ చనునే? నాపయి శిష్యవత్సలుఁడ వా
చార్యుండవా వందు రా

జనకున్ మిత్రుఁడవాఙ్ఞ ఋమ్మనికి చి
జ్జోదండ వైనన్ బలం
బును శౌర్యంబును కౌశలంబునొగి జూ
పుం బార్థుఁ డిప్పట్టునన్
మును నిన్ గెల్చియె రాజు గెల్చిన సులన్
మోదంబుతోఁ గైకొనున్.

కృపా—పార్థా! పోరుము. పరాక్రమమునఁ దండ్రివాదుకొని నన్నోటఁబుచ్చి పశువులం గొనుము.

(కృపాచార్యార్జునులు పోరాడుదురు)

కృపా—(కొంతవడికి దూరముగాఁబోయి తనలో) ఇన్నరుని గెల్చుటకు వలను పడకైన వశంబుగాదు.

(ప్రవేశము భీష్ముఁడు)

అర్జు—(భీష్మునకు సాగిలంబడి మ్రొక్కును)

భీష్ముఁ—విజయుండవు. లెమ్ము.

అర్జు—(లేచి కరములు మొగిడ్చి) తాతా!

ఉ॥ పెంచితి పెద్దఁజేసితివి
పిన్నటనాఁటను గోలె యుద్ధవీ
రాంచిత విద్యలం గఱపి
తౌర! మెఱుంగక పైకివచ్చు నీ
కొంచెఁపు మానిసిం గరుణఁ
గూర్చినిఘాదుము తాత! లోభిగా

నెంచకుమా! నిజానిజము
లీవ యెఱుంగుదు వానయుంచుమా !

(భీష్మార్జునులు యుద్ధముఁ జేయుదురు)

అర్జు—(భీష్ముని దఱుముకొని పోవును.)

ఉత్త—(తనలో) అహో! రెండుమత్తగజంబులు డీకొను చందంబున భీష్మార్జును లియువురు భయంకరంబుగ రణంబొనర్చుచుండిరి. (చూచి) భళీ! భళీ! అర్జునా! పితామహుండు విల్లుగైకొని పెనఁగు సందున శరంబు లంగంబున నాటి యాతని నొప్పించితివి. పాపము. కురువృద్ధుండు రథకూబరమూతగ నిల్చి సోలుచుండె (తలఁచూచి) ఓహో! భీష్ముని రథంబును మరలించుకొని సారథి పోవుచున్నాఁడే. పార్థుండిటకే వచ్చుచున్నాఁడు.

(ప్రవేశము అర్జునుఁడు)

అర్జు—ఉత్తరా!

మ॥ కురువృద్ధున్ సహితంబు నాహవమునన్
గోడాడఁగాఁ బుచ్చి త
ద్భరమున్ డించెను నుత్తరా! విజయమూ
ర్తాండుండు భీమానజం
డరిగంటం గలికానికిం గనఁబడం
డాశ్చర్యమైచూడు మి
త్త్రీ వన్ బార్థునిగా నెఱింగింతివ లే
దా? ధైర్యముం బొందుమా !

ఉత్త—మామా! నాకు దప్పితప్పటిదు. ఒక్కమాఱైన నీవాగ్రహము పీడవు. నీరథమూతక్కృత్య మే నిర్వహనొనరుపంజాలను.

అర్జు—(నగుచు) రాజానందనా! ఇంతమాత్రమైరింపుకుము. పసులన్నియుఁ జిక్కనయ్యెఁగాని గాండీవక్కుడుండ శౌండిత్యడిరా. సుయోధనుండభిమానవంతుఁడు. చూడుము (తెరవంకఁజూచి దుర్యోధను నుద్దేశించి) ధార్తరాష్ట్రగజా! దుర్యోధనా! దురభిమానా!

శా. ధాత్రిన్ క్షత్రియవంశ సంజనితు చం
దంబిద్ది కా డాగుటే ?
ధాత్రీఖండవు రాజరాజవు రణో
ద్దండుండ వోదుష్టచా
రిత్రా! పార్థుఁడె పిన్న; రమ్మనికి గీ
ర్తి న్రూపుమాపం గలాఁ
డే త్రైలోక్యము నత్తివచ్చినను నీ
క్షీపానము ల్నిల్చునే ?

(గోపాలిత్తునైై ప్రవేశము దుర్యోధనుఁడు)

దుర్యో—

శా. తుత్రింతున్నిన్నిదె నిల్వుమర్జునుఁడ! నెం
దుంబోదు వీవింక నా
కాంతారంబున నాలితో ననుజ సం
ఘాతంబుతో నేడ్వ కీ
పంతంబేటికి? రజ్జులేటికి? వృథా
గాంతేయా గజుఁడైన లేదు గత్యంతరాలయం

(భీష్మ ద్రోణ కర్ణ కృపాచార్యాశ్వత్థామలు దుర్యోధన సహాయార్థమై వచ్చియుందురు)

అర్జు—

శా. ఓరీ! కౌరవవంశనాశకుఁడ! యో
రోరీ! నికృష్టా! జడా!
యీరామంబిది కాదు; కాదొకట మా
యాజూదముం; గాదు కాం
తారత్నంబును రచ్చకీడ్చుటయు; యు
ద్ధంబియ్యదే మించె దో
స్సారా! గాండివమిద్దె గాచికొను రా!
కుక్షింభరా! దక్షతన్.

(దుర్యోధనునితోఁ జేరి సమ్మోహనాస్త్రముఁ బ్రయోగించును)

అందరు—(మూర్ఛబడుదురు)

అర్జు—ఉత్తరా! భవత్సహోదరి వచనంబులం జ్ఞప్తియున్నవా? వీరెల్లరు నా సమ్మోహనాస్త్రంబునఁ జొక్కి పడియున్నవారు. కౌరవేశ్వరుఁడు కుంభసంభవాత్మజుండుఁ బెట్టిన తలపాగలు నల్లనివి. రాధేయుండు పచ్చని తలచుట్టధరించె. ద్రోణకృపాచార్యుల యుష్ణీషములు వెల్లలు. త్వరితంబుగ నీవేగి యాపాగల నూడఁగత్తిరించి తెమ్ము.

క॥ కురుకుల పితామహుని కడ
కరుగ వలవ దాతఁడు మానయస్త్రమునకు మా
తెలుఁగును మెలఁకువతోఁ గడు
నరుదెమ్మా! కార్యసిద్ధి యలవడునంతన్

ఉత్త—(వానినిల్లఁ దవ్వును)

అర్జు—ఇంక మనము కొంతదవ్వుగనుండి యిటవీరేమి చేయుదురో చూచెదము గాక! రమ్ము (దూరముగా నిలువంబడుదురు)

(ఒక్కొక్కరు మెల్లన లేచెదరు)

దుర్యో—(భీష్మునితో) ఆచార్యా! ఇదికడు వింతగా నుండె ఇంతవఱకు మాశరీరము తెలియకుండె నేమి?

భీష్మ—కుమారా! ఈవేమి రోయుంగుదువు. క్రీడికార్యంబునకుం జోరఁడు గాని వేఁడందతేకిం దలలు దిగిడవియే. అట్లు కాకుండుట వానికరుణ పెంపు రాజా! మనము వచ్చినపని యింతవఱకాయె, ఇంక మఱలి పురంబునకుఁ బోదమురమ్ము.

దుర్యో—తాతా! నీయభిమతంబె తీర్పెద

(అందఱు నిష్క్రమింతురు)

అర్జు—(ముందటికివచ్చి) ఉత్తరకుమారా!

మ॥ కనుమా! కాలికిబుద్ధిజెప్పెను గురు
త్క్ష్మాపాలుడవ్వాని వె
న్కనె కర్ణుండు సగంబుచచ్చి చనుచు
న్నాఁడల్లదే సౌబలుం
డును గంగాతనయుండు ద్రోణుఁడుఁ గృపుం
డున్ బాణముల్దక్కమే
లని సాగించిరి కాలు తక్కగల యో
ధాగ్రేసరుల్వెంట రాన్.

వ॥ అల మనమీ శస్త్రాస్త్రాయుధంబుల జమ్మిపైఁ బెట్టి నగరంబున కేగుదము నీవుమాత్రము,

క॥ కురుసైన్యము గెల్చుటయున్
మఱి పశువులమందనెల్ల మరలించుటయున్
అరయఁగ నీదుపనుల్గా
బుగమున నెఱిగింపు మొందు పోనాడకుమా !

(విశ్వామిత్ర)

గద్య.

శ్రీ...... .....రామానుజాచార్య ప్రణీతంబయిన
శ్రీమదుత్తర గోగ్రహణంబునఁ జతుర్థాంకము.



శ్రీ

# ఉత్తరగోగ్రహణము.

## పంచమాంకము

—(0)—

(స్థలము విరాటుని కొలువు. విరాటుఁడు, మంత్రి, కంకుఁడు, ఆసీనులై యుందురు. సైరంధ్రి దూరముగా నిలువంబడును.)

విరా—సుశర్మ నోటువడఁ జేసి వచ్చితి మనమె జయశీలుర మైతిమి అమాత్యా! మఱి కుమారుం డుత్తరుం డెందున్నవాఁడు?

అమా—దేవా! కురునాథుండు గాంగేయ కలశజ వికర్ణ కర్ణ కృపాశ్వత్థామాది యోధవీరసమేతంబుగ నిజసైన్యంబుం గొనివచ్చి యుత్తరదెసంగల మన పసులంబట్టుటవిని బృహన్నలను రథసారథిగాఁగొని యుత్తరుం డొక్కరుండ గోవ్రాతము మరలింపఁగఁబోయె.

విరా—(భయాశ్చర్యములు గదుర)

శా. కిందున్ మీఁదు నెఱుంగ కొక్కరుఁడ యే
గెం గాదె బాలుండు పైఁ
బందం బేవిధినోపు? పేడి యొకఁడా ?
సారథ్యపుం జేతకై;
డెందం బాకల పాటు జెందెడి; నరిన్
డీలించు నేవీఁడు? గ

ర్వాంధుల్ భూరి భుజాబలుల్ మగలు దు
ర్వార ప్రజ ల్వారటన్.

శిథిలంబుగ వలయు సైన్యంబులం జూచు నలక్ష్యంబొనరించి పోరంటు వారెల్లఁ గాఁ జేయుకుము.

తే. గీ. పావఁడెక్కడ? కౌరవేశ్వరుని సేనఁ
గలశజతదాత్మజ వికర్ణ కర్ణ భీష్మ
చిత్రరథదుమ్ప్రహ విచిత్రసేన దుర్ము
ఖప్రముఖులెక్కడ? మనంటు గాసిపడితెను.

కంకు— రాజా! సుశర్మపైకేగి విజయుండవై వచ్చితివి. ఉత్తరుండును, బృహన్నలయు సారథియైన కతంబున జయంబొందెను. ఘనంబు విచారంబును వీడుము. ఒక్క కౌరవసేనయే కాదు. బృహన్నల యుండుఁగాన దేవాసురబలపరాక్రమంబున భవత్పుత్రుం డనిమిషకోటి నైనగెలుచు.

విరా— (మంత్రికై చూచి) కడుబలవంతులమగాఁ బంపుము. అచ్చటఁ గల తెలంగతింగి మనుజం బలుపుటకు చారులంబంపుము.

(ప్రవేశము గోపాలకులు)

గోపా— (దండములు పెట్టుచు) రాజా! దొరా! ఏలికా! దండాలు దండాలు. మన ఉత్తరకుమారగారు మహరాజబాబూ! దుర్యోధనున్ని సాహురులన్ని ముక్కు తెగ్గొట్టి మనయావుల్ని అన్నింటిని తెస్తున్నారు. మాకున్ని కూడా రమ్మంటే ముందే వస్తున్నారు. మాకు చెప్పమని మమ్మ ముందంపించారు దేవా! చిత్తగించుకోండి.

విరా— (ఆనందమున్నఁ జె) నిజంబుగఁ గొడుకు విజయుండై వచ్చుచున్నాఁడా?

గోపా— చిత్తం రాజా! చిత్తం

విరా — మంత్రివరా! వీరికింగట్టఁ గ్రొత్త పట్టంబుల నిప్పింపుము విజయుండై వచ్చుమత్పుత్రు నెదుర్కొనుటకు మంగళతూర్యంబులతో వారాంగనా కదంబములతోఁ బోయి సగౌరవంబుగ న్వానిం బురంబుఁ బ్రవేశపెట్టుము.

అమా — చిత్తము (నిష్క్రమించును)

విరా — గోపాలకులారా! మీరు మా యమాత్యుని వెంటనే చనుఁడి.

గోపా — చిత్తం మహాప్రభూ! దండాలు. (నిష్క్రమింతురు)

విరా — కంకా! ఒక్క నిమేషంబు జూదంబాడుదము, రమ్ము

కంకు — ఈవీనాఁడు జయముపై జయముగొని యున్నాఁడవు నీతో నేనాడ నేఁడు గెలువంజాలను

విరా — (నగుచు) హాస్యసముం గట్టిపెట్టుము. లేదిరమ్ము. సైరంధ్రీ! ఈ వేగ సారెలం గొనిరమ్ము

సైరం — (నిష్క్రమించును)

కంకు — మత్స్యమహీపాలా, జూదమాడి కౌంతేయాగ్రజుండు రాజ్యంబును అనుజులను భార్యను దన్నును ఒడ్డంబుగా నొడ్డియోడి యరణ్యంబుల పాలయ్యె ఈ యాటఁగీడుండదమ్ముట. నిజంబు

సయి — (ప్రవేశించి పాచికలిచ్చును.)

విరా — ఇంకరమ్ము.

విరా — కంకుఁడు — (జూదమాడుదురు.)

విరా — (జూదమాడుచు) కంకభట్టా! నాసుతుండు కురుసైన్యంబులమట్టి బాహాబలశౌర్యములంజూపి భీష్మద్రోణుల సహితంబుగెల్చి గోగణంబుందెచ్చె మాసన్నంగడైన నిట్టివాఁడని వినియుండఁ టిమోయుత్తరుఁడు కులభూషణుండు.

కంకుఁ—రాజా! అంతటి కురువీరుల రణంబున నోర్చియుఁ గాయుత్తరుఁడె జయించెనని యింతకంటె నక్కజమంకుజా? ఈతఁడొక్కండె వసుంధరావలయంబునఁ బ్రసిద్ధికెక్కఁడా?

విరా—(కటకటఁబడి) ఓయీ! మాయుత్తరుని విజయము సందియమనియా యిట్టులాడుచుంటివి? ఇంతవఱకు సైరించితి. ఇంకనిట్టి పలుకు లుడుగుము.

కంకు—కురుబలమే యనవేఁ? బృహన్నల తేరుపయిఁ గూరుచున్నంత సురాసురగణంబులు వచ్చిన నుత్తరుం డొక్కండ గెల్వవచ్చు.

విరా—(కుపితుఁడై) విప్రా! పాఱుబోతా! ఉచితాలాపంబులఁ నైన నాడఁగాలేవు. మత్సూనుశౌర్య ప్రసంగంబులు నీకేటికి? మానుము.

కంకు—నాకుఁజూడ నుత్తరుఁడే సారధియై బృహన్నల రధికుండై కురుబలంబు గెలిచి పశుగణంబుఁ దెచ్చెనంచుం దోచెడి. రాజా! ఇదియే యథార్థము. కనుకపురంబున బృహన్నల విజయంబు చాటంబంపుము.

విరా—(ఉగ్రుఁడై)

శా. కంకా! మానవు నీ ప్రలాపములు కి
న్కంబూనఁగాఁజేతు; ని
శ్శంకన్ రాజును జూతు వుత్తరభుజా
సారప్రసంగంబు చా
లింకన్ నిల్పుము పేడినింబొగడు టెం
తే విడు మీసారెతో
బి-కంబాడఁగ వ్రేతు చూడుమిదె ఛీ!
విప్రా! కృతఘ్నా! జడా!

(అని సారెఁ గొని వ్రేయును)

కంకు—(కోటుపడి నెత్తురుగారఁ సైరంధ్రివంకఁజూచును)

సైరంధ్రి—(పడిగవచ్చి చీరచెఱఁగుతో నెత్తురు తుడుచును.)

విరా—సైరంధ్రి! ఈ వీబాపని కోటు గంటిందొరఁగు నెత్తుటిం దుడుచుటకుఁ గారణ మేమి?

సైరం—రాజా! ఇయ్యనఘుండు విమలవంశోద్భవుండు. పుణ్యాచార పరాయణుండు. అట్టి యీ మహాత్మునిరక్తంబు వసుధపై నెన్నిబిందువులు పడునో యన్ని వర్షంబులు నీరాజ్యమున దశావర్షభయము వాటిల్లును నీ కొక్క కీడునుం గలుగుట నామనం బొల్లమింజేసి యీ చందం బొనరించితి

(అంత ప్రవేశము, పణిహారి)

పణి—(ప్రణమిల్లి) రాజా! జయము జయము రథికసారథులగు నుత్తరబృహన్నలలు మందిరద్వారము చేరవచ్చియుండిరి.

విరా—లోనం బ్రవేశపెట్టుము.

కంకు—ఓయీ ప్రతిహారీ! బృహన్నల నన్నెక్కుడు మన్నించుకతంబున నీ నెత్తురు కనుంగొన్నచో నన్నుగోపంబు ధరాపాలునపై దలంచును. కాన కొంతవడి బృహన్నల నుండనిల్పి యుత్తరప్రవేశము ముందుగా వించుము.

పణి—(నిష్క్రమించి యుత్తరునితోఁ బ్రవేశము.)

ఉత్త—(తండ్రికి నమస్కరించును.)

విరా—(కొడుకును గౌఁగిలించుకొని)

క. సుతుఁడ! యెటులరులఁ గెలిచితి
వతులితబలశాలివయ్య! యయ్యకు పేరుం
బ్రతిభలఁ దెచ్చిన సద్గుణ
మతుఁడవు కులభూషణుఁడవు మాన్యచరిత్రా!

భూమిని నిట్టిచెయ్దములు
పోలునె? మత్స్యమహీధవుండు రా
నాముని గద్దియన్‌డిగ వ
హంకరణంబిది చోద్యమయ్యెఁ; బో
రాములు చాలు సిగ్గిలుము
రాచరికంపుఁ బనుల్ త్యజింపుమా!

బృహ—

మ. అరరే! యెట్టేఁడవేగతింబలికి తా
హా! లోకులున్నవ్వరే
పరుఁడే? యాతఁడజాతశత్రుఁడు కృపా
పారీణుఁ డెక్కందగుం
జిఱునవ్వొల్కఁగ మేఘవాహనమహా
సింహాసనంబేని నీ
ఛిఱుగద్దెన్ వసియింపఁగాఁ దగఁడే? యి
స్సీ! మత్స్యభూపాలకా!

విరా—(ఆశ్చర్యమున) ఈతండు ధర్మసుతుండయినచోఁ జాండాలీ భీమార్జున నకుల సహదేవులేరి ?

(ప్రవేశము భీమ నకుల సహదేవులు)

బృహ—

మ. పులులంగాచెను గోతులన్ బలుల నే
పుంజాపి మర్దించు; మ

విరా—(పరమానందమున) పాండవేయుల విజయంబుకంటె మాకొండువలెనే వాజన్మము తరించె. ధర్మజా! ఇంక భవదీయానుగ్రహము.

భరతవాక్యము.

ధర్మజ—

శా. న్యాయాన్యాయ విచక్షణంబు పదిలం
బౌఁగాక; ధర్మంబు నా
పాయంబై జయమొందుఁగాక, ధరణీ
పాలోత్తముల్ శూరులై
శ్రేయంబందెదు గాక; సద్గుణ
గణ శ్రీవర్ధిలుంగాక, యో
చాయంజూచిన నిల్చుఁగాక నిలపై
శాంతస్వభావంబొగిన్.

— గద్య —

శ్రీమన్నారాయణ వరప్రసాదాసాదిత కవితాధురీణ కౌండిన్యసగోత్ర
శుక్తిముక్తాఫల గోమఠాన్వయ ప్రశస్త వరదాచార్యపౌత్ర
రంగాచార్య వేంకటాంబికాసూను రామానుజాచార్య
ప్రణీతంబయిన శ్రీమదుత్తరగోగ్రహణంబునఁ
బంచమాంకము సంపూర్ణము.

—(౧)—